## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..








"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో భాగంగా ఈ పుస్తకాన్ని ద్వారకాధీష్ వాస్తు వెబ్ సైట్ నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో భాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) ద్వారకాధీష్ వాస్తు వారి వెబ్ సైట్: http://dwarkadheeshvastu.com
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్థం ఉచితంగా eBook రూపంలో ద్వారకాధీష్ వాస్తు వారి వెబ్ సైట్ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Helpline/WhatsApp: 9042020123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

ద్వారకాదీష్ వాస్తు వారి వెబ్ సైట్:

**http://dwarkadheeshvastu.com**

Free Download Indian epi ×

dwarkadheeshvastu.com/Epic-List-of-Indian-Epics-in-Telugu.aspx

Hindi | Sanskrit | English | Gujrati | Bangali | Oriya | Telugu | Nepali | Marathi | Kannad | Asamiya | Urdu | Malyalam | Avdhi | Ved | Puran | Bhagwat | Ramayan | Geeta | Punjabi | Jain Dharm | Islam | Karm Kand

Dwarkadheesh Vastu

Home
Contact Us
हिन्दी वेबसाईट
Vastu Consultancy
Download Vastu Book
FREE Astrology Books

FREE Devotional Music (Mp3)
FREE Devotional Videos
FREE Devotional Books (PDF)
FREE Educational Books (PDF)
FREE Educational Videos
FREE Devotional Wallpapers

Dwarkadheesh Vastu
Like
3,663 people like Dwarkadheesh Vastu.
Facebook social plugin

A | B | C | D | E | F | G | H | I
J | K | L | M | N | O | P | Q | R
S | T | U | V | W | X | Y | Z

1. 12 Rashi Fal (Hindi)
2. 300 Saal Sikh Itihaas De Naal (English)
3. Aachar Manjari (Nepali)
4. Aadarsh Bhakti Prem (Telugu)
5. Aadarsh Dampatya Jeevan (Telugu)
6. Aadarsh Desh Bhakt (Hindi)
7. Aadarsh Manav Hridaya (Hindi)
8. Aadarsh Nari Sushila (Bengali)
9. Aadarsh Nari Sushila (Gujrati)
10. Aadarsh Nari Sushila (Tamil)

**Indian Epics in Telugu**

1. Aadarsh Bhakti Prem (Telugu)
2. Aadarsh Dampatya Jeevan (Telugu)
3. Aadarsh Nari Sushila (Telugu)
4. Aadhyatm Ramayan (Telugu)
5. Aandhra Mahabhagwat Dasham Skandh (Telugu)
6. Agni Puranam (Telugu)
7. Aladdin Adbhutha Deepam (Telugu)
8. Alibaba Dongalu Katha (Telugu)
9. Amavasya Somavara Vratham (Telugu)
10. Amma Neeti Kathalu Katha (Telugu)
11. Amulya Samaya Ka Upyog (Telugu)
12. Anantapadmanabha Asthotram (Telugu)

You Tube

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ధనసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

॥ ఓం శ్రీ పరమాత్మనే నమః ॥

# భక్తుడు, భగవంతుని బాంధవ్యము

భగవంతుడు, భక్తుని సంబంధ బాంధవ్యమును, దాని రహస్యమును కేవలము ఆ భక్తుడు, భగవంతుడు మాత్రమే తెలియగలరు. శ్రీరామ, భరతుల ప్రేమను గూర్చి తెలియుటలో విదేహరాజగు జనకుడు కూడా తాను అసమర్థుడననియే భావించెను. ఆయన తన అసమర్థతను ప్రకటింపుచు యిట్లు వాక్రుచ్చెను-

**ధరమ రాజ నయ బ్రహ్మ విచారూ। ఇహాఁజథామతి మోర ప్రచారూ॥**
**సోమతి మోరి భరత మహి మాహీ। కహైఁకాహఛలిఛు అతినఛాంహీ॥**
(శ్రీరామచరితమానస్. అయోధ్య. 287/2,3)

**దేవి పరంతు భరత రఘువర్ కీ। ప్రీతి ప్రతీతి జాఇ నహిఁ తరకీ॥**
**భరతు అవధి సనేహ మమతాకీ। జద్యపి రాము సీమ సమతా కీ॥**
(శ్రీరా.చ.మా. అయోధ్య. 288/3)

అనగా - 'ధర్మము, రాజనీతి, బ్రహ్మవిచారము - అను నీ మూడింటిలోనూ నా బుద్ధిననుసరించి నాకు ప్రవేశము ఉన్నది. అనగా, నేను ధర్మమును నిర్ణయించగలను, రాజనైతిక సమస్యలను పరిష్కరించగలను, బ్రహ్మజ్ఞానమును కూడా ఉపదేశించగలను. ఈ విషయములను గూర్చి నా బుద్ధి పనిచేయును. కాని, అదే నా బుద్ధి భరతుని గొప్పతనమును గూర్చి వర్ణింపలేకపోవుటయేమి? కనీసము ఎగిరి గంతేసి, దాని నీడను కూడా స్పృశింపజాలకున్నది. ఓదేవీ! భరతుని, శ్రీరామచంద్రుని ప్రేమ, పరస్పర విశ్వాసము తర్కింప శక్యముగానిది. అది బుద్ధి, చింతనల హద్దుకు అతీతమైనది. అయినను, శ్రీరామచంద్రుడు సమతకే సరిహద్దు వంటి వాడు కాగా, భరతుడు ప్రేమకు, మమతకు గరిమవంటివాడు.' భక్తుని భావమును భగవంతుడు మాత్రమే గుర్తించగలడు. భగవంతుని భావమును కూడా భక్తుడే గుర్తించగలుగును. కావుననే వారలు పరస్పరము సహజముగా అనుసరించెదరు. నేను భగవంతుని అభీష్టమును

॥ శ్రీహరిః ॥

# వినమ్ర నివేదన

నిత్యలీలాలీనులు, పరమశ్రద్ధేయులు, కళ్యాణ్ పత్రిక ఆది సంపాదకులగు శ్రీ హనుమాన్ ప్రసాద్ పొద్దార్ గారు "భాఈజీ" అని ఆధ్యాత్మిక భావంతో సార్వజనీన సౌభ్రాతృత్వమును స్థాపించిన పవిత్ర పుణ్యమూర్తులని వేరుగా చెప్పనక్కరలేదు. వీరలు కళ్యాణ్ పాఠకులెల్లరకు చిర పరిచితులు. ఇట్టి మహాత్ముని వేరు, వేరు హిందీ వ్యాసములను ఒకచోట చేర్చి సులభమైన తేట తెలుగులోనికి అనువదింపబడి "భగవంతుడే ఆత్మీయుడు" అను పేరుతో తెలుగు పాఠక లోకమునకు అందించుట కెంతయో సంతసించు చున్నాము.

ఈ పుస్తకమును చదివిన పాఠక మహాశయులెల్లరు తమ నిజమగు ఆత్మీయుని గుర్తించి, అతనికే మరింత చేరువై ధన్యత నొందగలరని భగవానుని మనసారా ప్రార్థించుచున్నాము.

ఇట్లు
ప్రకాశకులు
గీతాప్రెస్ – గోరఖ్‌పూర్.

---

# విషయసూచిక

అనుసరించెదనుగాక! అని భక్తుడు కోరుకొనును. అటులే భగవంతుడు తన భక్తుని క్రియను అనుసరించి వ్యవహరించును. సీతాదేవి శ్రీరామునికై శోకించగా, శ్రీరాముడు సీతకొరకై విలపించెను. లక్ష్మణుడు, రాముని వియోగమును సహింపజాలడు. అటులే లక్ష్మణుడు మూర్ఛిల్లిన పిదప శ్రీరాముడు వికలుడై తన ప్రాణములను సైతము త్యజించుటకు సిద్ధమయ్యెను. అందువల్లనే శ్రీకృష్ణభగవానుడు యిట్లు నుడివెను–

**న తథా మే ప్రియతమ ఆత్మయోనిర్న శంకరః।**
**న చ సంకర్షణో న శ్రీర్నైవాత్మా చ యథా భవాన్॥**
**నిరపేక్షం మునిం శాంతం నిర్వైరం సమదర్శనమ్।**
**అనువ్రజా మ్యహం నిత్యం పూయయేత్యంఘ్రిరేణుభిః॥**
**నసాధయతి మాం యోగో న సాంఖ్యం ధర్మ ఉద్ధవ।**
**న స్వాధ్యాయస్తపస్త్యాగో యథా భక్తి ర్మమోర్జితా॥**

(శ్రీమద్భాగవతం–11/14/15,16,20)

'ఉద్ధవా! నాకు నీ వంటి భక్తుల కంటే, నా పుత్రుడగు బ్రహ్మగాని, సాక్షాత్తు నా స్వరూపుడగు శంకరుడు గాని, సోదరుడు బలరాముడుగాని, నిరంతరము నా సేవా తత్పరురాలగు లక్ష్మీదేవిగానీ, అంతెందులకు స్వయంగా నా ఆత్మ కూడా నా కంతటి ప్రియమైనవారు కారు. ఎటువంటి కోరిక లేనివారు, నన్నే మననము చేయువారు, శాంతచిత్తులు, వైరములేని వారు, సర్వత్రా నన్నే చూచెడివారు, అగు నాభక్తుల చరణధూళితో నన్ను నేను పవిత్రమొనర్చుకొనుటకుగాను వారి వెనుక, వెనుకగా సదా తిరుగాడుచుండెదను. విశుద్ధము, అనన్యమునగు నా యందు గల తీవ్రమైన భక్తి నన్ను బంధించినట్లుగా, యోగము, జ్ఞానము, ధర్మము, వేదాధ్యయనము, తపస్సు, త్యాగము వంటివి ఇవి ఏవియూ నన్ను వశపరచుకొనజాలవు.'

**మయి నిర్బద్ధ హృదయాః సాధవః సమదర్శనాః।**
**వశీ కుర్వంతి మాం భక్త్యా సత్స్త్రియః సత్పతిం యథా॥**
**సాధవో హృదయం మహ్యం సాధూనాం హృదయం త్వహమ్।**
**మదన్యత్ తేన జానంతి నాహం తేభ్యో మనాగపి॥**

(శ్రీమద్భాగవతం–9/4/66,68)

'(ఓయి దుర్వాసా!) ఎవని హృదయము నాతో బంధింపబడినదో, అంతటా, అందరిలో, అన్నివేళలా సమరూపముతో నన్నే ఎవడు జూచునో, అతడు తన భక్తితో ఒక పవిత్రమైన స్త్రీ తన భర్తను వశపరుచుకొనినట్లుగా, నన్ను తన వశము గావించుకొనును. ఎక్కువగా వేయి మాటలు చెప్పనేల? నిజమునకు అట్టి భక్తుడే నా హృదయము; నేను అతని హృదయమును. అతడు నన్ను విడిచి మరెవరినీ ఎరుగడు. అట్లే నేను కూడా అతనినిదక్క మరెవరినీ ఎరుగను.'

ఇట్టిది భగవంతుని భావము. ఇక భక్తుని భావమును పరికించండి! అది కూడా ఆ భగవంతుని వాక్కులలోనే వినండి–

న పారమేష్ఠ్యం న మహేంద్ర ధిష్ణ్యం
న సార్వభౌమం న రసాధిపత్యం।
న యోగ సిద్ధీరపునర్భవం వా
మయ్యర్పితాత్మేచ్ఛతి మద్వినాన్యత్॥ (శ్రీమద్భాగ–11/14/14)

మత్సేవయా ప్రతీతం చ సాలోక్యాది చతుష్టయమ్।
నేచ్ఛంతి సేవయా పూర్ణాః కుతోఽన్యత్ కాలవిప్లుతమ్॥
(శ్రీమద్భాగ–9/4/67)

'నాకు తన చిత్తమును సమర్పించినవాడు, నన్ను విడచి, బ్రహ్మదేవుని ఆధిపత్యము లభించినాసరే, దేవేంద్రుని రాజ్యము లభించినా సరే, సార్వభౌమ సామ్రాజ్యము లభించినాసరే, పాతాళలోకాధిపత్యము లభించినా సరే, సమస్త యోగసిద్ధులు ప్రాప్తించినా సరే, చివరకు కైవల్యమోక్షమైనా సరే, అతడు కోరుకొనడు.'

'నా భక్తుడు నా సేవలోనే పూర్ణ మనోరథుడగును. అతడు నా సేవను విడిచి సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్య ముక్తులలో దేనినీ కోరనప్పుడు, కాలగర్భంలో నశించిపోయెడు ఇతర వస్తువులను గూర్చి చెప్పనేల?'

ఇయ్యది భగవంతుడు, భక్తుని భావముల బాహ్యదిగ్దర్శనము మాత్రమే. అది కూడా స్వయముగా భగవంతుడే లోకమునకు ఆదర్శప్రాయముగా భక్తుడు, అతని భక్తిని గూర్చిన మహత్తును ప్రకటింపుచు చేయబడినదే. నిజమునకు

భగవంతుడు, భక్తుని పారస్పరిక భావములు మనకు అచింత్యములు. అవి మన మాటలకు, మనస్సునకు ఎప్పుడునూ అందబడవు. వారి మధ్యన గల సంబంధము ఎలాంటిదో ఎవరునూ తెలుపజాలరు. అయితే, వారి పరస్పర వ్యావహారిక బాహ్యలీలలను చదివియు, వినియు, పాడియు, మననము చేసియు మనము పరమ పవిత్రులమయ్యెదము. వాస్తవమునకు భగవానుడు, భక్తుడు ద్వివిధ స్వరూపములలో గల ఒకే ఒక పరమ వస్తువు. లీలానందమునకే వారి ద్వివిధ స్వరూపములు. అంతియేగాక, లీలలు లోకపావనములు గదా!

సీ. నిన్నెరుంగగ మాకు కొన్ని గుర్తులు జెప్పి
 మూగదై శ్రుతి మౌనమును వహించె,

వేనోళ్ళ బొగడిన విభవాదియే గాక
 శేషింప తానాదిశేషుడయ్యె,

నిన్నెరింగిన వారలన్న తెల్పుచు తత్త్వ
 మిదమిత్థమని నిరూపించరైరి,

అంతరంగములోన నెంత యోచించిన
 తెలిసినట్లౌ నేమి తెలియకుండు,

గీ. నీవు కరుణించినంగాని నిన్నుగాంచ
నలవి గాదయ్య బహు జన్మములకునైన
వేగ కృపతోడ బ్రోవుమో వేదవేద్య
పరమ కరుణాంతరంగ! శ్రీపాండురంగ॥

(శ్రీ పాండురంగ శతకము-10)

అన్నట్లుగా భగవంతుని వాస్తవ స్వరూపము ఎట్లుండును? అను విషయము ఆ భగవంతుడే తెలియును. భగవానుడు తెలియబరచవలెనని భావించినప్పుడే, ఏదో ఒక అంశములో వారు తెలియుదురు సుమా! భగవంతుడు ఇలాగే ఉన్నాడని, ఈ లోకంలో నేటివరకు ఇదమిత్థంగా ఎవరునూ చెప్పలేదు, యిక చెప్పలేరు, ముందు చెప్పబోవరు. ఒకవేళ, ఎవరేని అటుల చేయుటకు సాహసించినచో, అతడు అమాయకుడో, పట్టుదలగలవాడో, మిథ్యావాదియో

కాగలడు. ఇటుల అయినప్పటికి కూడా భగవంతుని గూర్చి లోకమునందు చేయబడిన వర్ణనములన్నియునూ, వాని, వాని స్థానములలో వాస్తవములే అయియున్నవి. ఏలయన, పరమాత్మలోనే సర్వము అంతర్భావమైయున్నది. అనంత ఆకాశములో ఘటాకాశము. మఠాకాశము అన్నీ విలీనమై పోవునట్లుగా, మహా పరమాత్మలో సర్వమూ అంతర్భావమై యున్నవి. ఏదో ఒక గ్రామములో జరిగిన సంఘటన నుదహరించి, లోకములో ఈ విధముగా జరుగుచున్నదని చెప్పడము మిథ్యకాబోదు; ఎందుకనగా, ఆ గ్రామము ఈ లోకములోనే ఉన్నది కదా! కావున అది కూడా లోకమే అగుతుంది కాని, ఆ గ్రామమునే లోకమని మాత్రము తలంచరాదు.

ఈ జగత్తు ప్రాకృతికమైనది; హద్దుకు లోబడినది. సూక్ష్మబుద్ధి ద్వారా అవగాహనా యోగ్యమైనది కనుక ఈ జగత్తు వర్ణింపబడ గలుగుతుంది. కాని అప్రాకృతికము, అసీమము, అనంతము, అపారము, అలౌకికము, నిరాకారము అయిన పరమాత్మను గూర్చి వర్ణించుట కడుంగడు అసంభవము. అందువలననే వేదములు అతనిని 'నేతి, నేతి' అని మౌనము వహించినవి. నిర్గుణ, అక్షరబ్రహ్మ వికారశీలము, జడము నగు అపరా ప్రకృతి యందు స్థితమైన నిర్వికార పరాప్రకృతి రూప జీవాత్మ, అపరాప్రకృతి, దాని వికారముతో నుత్పన్నమగు ఉత్పత్తి, వినాశశీలమగు సకల పదార్థములు, భూతములన్నింటి ఉద్భవ, వికాసముల నొనగూర్చు విసర్గరూప కర్మ, వ్యక్త జగత్తునకు అభిమాని, సూత్రాత్మయగు అధిదైవము, ఈ శరీరము నందు అంతర్యామి రూపములో స్థితుడైన విష్ణురూప అధియజ్ఞము – అను నివియన్నియునూ ఆ నిత్య, నిర్వికార, సచ్చిదానంద ఘనమగు భగవానుని విశేష భావములు లేదా ఆతని ఆంశిక ప్రకాశములు. తప్పనిసరిగా స్వభావముతోడనే పూర్ణమగుట చేత ఆంశిక ప్రకారమై నప్పటికిని కూడా సమస్తమూ భగవద్రూపము నందే పూర్ణములై యున్నవి. ఈ రకంగా సమస్తమునందు స్థితమైన సర్వనియంత, సర్వాధారుడు, అందరికి సత్తా, స్ఫూర్తి నిచ్చువాడు, సమస్తమునకు అద్వితీయకారణుడు, సర్వోత్కృష్టుడు. సర్వమయుడగు భగవంతుని గూర్చి ఎవరు వర్ణింప గలుగుదురు?

గీతలో భగవానుడు యిట్లు వక్కాణించెను-

> మయా తతమిదం సర్వం జగదవ్యక్త మూర్తినా।
> మత్ స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః ॥
> న చ మత్ స్థాని భూతాని పశ్యమే యోగమైశ్వరమ్ ।
> భూత భృన్నచ భూత స్థో మమాత్మా భూత భావనః॥ (9/4,5)

'అవ్యక్తమూర్తి యగు నా ద్వారా ఈ జగత్తంతయు వ్యాపించియున్నది. సర్వభూతములు నా యందే గలవు కాని, నేను వానిలో లేను. ఆ సకల భూతములు కూడా నా యందులేవు. సర్వభూతముల ఉత్పత్తి, ధారణ, పోషణముల చేయువాడనగుతూ కూడా నేను స్వరూపతః ఆ భూతములలో లేను, అను నా ఈశ్వర యోగమును గాంచుము.'

భగవానుని స్వరూపమును గూర్చిన కథనములలో పరస్పర విరుద్ధములైన మాటలు ప్రతీతమగుచున్నవి. 'నేను అంతట ఉన్నాను; దేనిలో లేను. అందరు నాలో ఉన్నారు; ఎవరూ నాలో లేరు'- అను మాటల తాత్పర్యము సులభముగ బోధపడకున్నది. అందువలననే 'పరమార్థము' 'వ్యవహారము' అని విభజించి వ్యాఖ్యానింపబడుచున్నది. అయితే భగవానుని 'ఐశ్వర్య యోగము' అనగా నిదియే. కావున విషయ విమోహితమైన మన జడబుద్ధి దీని నెట్లు తెలియ గలుగును? మనకు అసంభవమైన దంతయు భగవంతునకు సంభవము. భగవంతునిలో పరస్పర వైరుధ్యంగల గుణధర్మములు ఏక కాలమున వెలుగు చుండును. అటులే విరోధము లన్నింటి సమన్వయము గలదు. అందుచేతనే భగవంతుని గూర్చి ఏ విధముగా వర్ణింపబడిననూ, ఆతని యందు సత్యరూపముతో అది సమన్వయింపబడును.

భగవంతుడు నిర్గుణుడగుతూ కూడా సగుణుడు; నిరాకారుడగుతూ కూడా సాకారుడు. అతడు నిష్క్రియుడు, నిర్విశేషుడు, (నిర్గుణుడు), నిర్లిప్తుడు, నిరాధారుడు అగుతూ కూడా సృష్టి, స్థితి, సంహారముల సలుపువాడు. సవిశేషుడు (సగుణుడు), సర్వవ్యాపకుడు, సర్వాధారుడు అయినవాడు. సాంఖ్యములో చెప్పబడినట్టి పరస్పర విలక్షణయుక్తమైన అనాదియగు ప్రకృతి పురుషులు, చేతనాచేతన ద్వివిధశక్తులు, సకలజగత్తు ఉత్పన్నమగు చున్నట్టి భగవంతుని పరా,

అపరా ప్రకృతులు కూడా ఉన్నవి. ఈ ప్రకృతులు రెండింటి ద్వారా నిజమునకు భగవంతుడే తన ఉనికిని చాటు చుండును. ఆయన అంతటా ఉంటూ కూడా అన్నింటికంటే శ్రేష్ఠుడు. అతడే సర్వమును జూచునట్టి ఉపద్రష్ట. అతడే నిజమైన సమ్మతి నొసగునట్టి అనుమంత. అతడే భరణ పోషణ చేయునట్టి భర్త. జీవరూపముతో భోక్తయైనవాడు అతడే. అతడే సర్వలోకమహేశ్వరుడు. అతడే అంతటా, అన్నింటా వ్యాపించియున్న పరమాత్ముడు. అతడే సమస్త ఐశ్వర్య, మాధుర్యములలో పరిపూర్ణుడైన భగవంతుడు. అతడు ఒక్కడే అయినప్పటికినీ, అనేక రూపములలో విభజింపబడినట్లుగా తెలియబడుచున్నాడు. అనేక రూపములలో వ్యక్తమగుతూ కూడా అతడు ఒక్కడే. వ్యక్తము. అవ్యక్తము; అవ్యక్తమున కంటే కూడా శ్రేష్ఠమగు సనాతన అవ్యక్తమూ అతడే. క్షరుడు, అక్షరుడు; అక్షరుని కంటే కూడా ఉత్తముడైన పురుషోత్తముడు కూడా అతడే. అతడు తన మహిమవల్లనే మహిమాన్వితుడు, తన గౌరవముతోడనే గౌరవాన్వితుడు, తన ప్రకాశము చేతనే ప్రకాశితుడు.

ఇట్టి భగవంతుని యథార్థమైన స్వరూపజ్ఞానముగాని, దర్శనముగాని, అతని కృపలేకుండా లభించడము దుర్లభము. అతడనుగ్రహించి ఎవని యందు తన జ్ఞానము కలిగించునో, అతడే భగవంతుని తెలియగలుగును. అతని కృప భక్తుల యందే వ్యక్తమగుచుండును. **భక్తి రహితమైన కర్మతో, ప్రేమ రహితమగు జ్ఞానముతో భగవానుని యథార్థ స్వరూపము బోధ పడునది కాదు.** నిష్కామ కర్మతో భగవానుని ఐశ్వర్యరూపము తెలియబడును. అటులే తత్త్వజ్ఞానముతో అతని అక్షర పరబ్రహ్మరూపము తెలియనగును కాని, అతని మధురాతి మధురమైన పురుషోత్తమ భావము మాత్రము అనన్యమగు ప్రేమ భక్తితోడనే సాక్షాత్కరించును. వైధీ భక్తి సాధన చేయగా, చేయగా, అది నిత్యప్రేమ రూపముగా పరిణతి నొందును. భగవంతుని అంచిత్యశక్తిని, అనిర్వచనీయమగు ఐశ్వర్యమును తెలిసిన భక్తుడు కేవలము అతనినే పరమగతిగా, పరమాశ్రయముగా, పరమ శరణ్యునిగా భావించి బుద్ధితో, మనస్సుతో, చిత్తముతో, ఇంద్రియములతో, తనువుతో, సర్వవిధములుగా సర్వథా తననుతాను అతని చరణాబ్జములయందు సమర్పించుకొనును. అప్పుడా భక్తుడు అతనికే తన మనస్సును కానుకగా చేయును. అతని యందే బుద్ధిని నిలిపివేయును. అతని గూర్చియే చర్చించును.

అతని నామగుణములనే గానము చేయును. అతని యందే సంతుష్టుడై యుండును. ఆతని యందే రమించుచుండును.

సీ. చిత్తమా! శ్రీకృష్ణు చింతించు మెప్పుడు
నాలుకా! చవిజూడు నామ సుధల,
కరములారా! మీరు హరిని పూజింపుడు
వీనులార! వినుడు విష్ణు కథలు,
కనులార! రాధికా కాంతుని గాంచుడీ
గుడిలోని కరుగుడో యడుగులార!
ఘ్రాణమా! తులసీ సుగంధ మాఘ్రాణించు
మస్తకమా! మ్రొక్కు మాధవునకు,

గీ. అనుచు లోలోన సకలేంద్రియముల నిన్ను
గొలువగా వేడు కొందును గోపబాల!
సేవ గొనుమయ్య నిరతము శ్రీ ముకుంద!
పరమ కరుణాంతరంగ! శ్రీ పాండురంగ॥ (శ్రీపాండురంగశతకము–21)

ఈ విధముగా భక్తుడు తన – తను, మన, ప్రాణములను, కాల, కర్మ, గుణములను, లౌకిక, పారలౌకిక భోగములను, ఆసక్తిని, కోరికను, వాసనను, సర్వస్వమును తన ప్రభువునకు కర్పూరకళికగా హారతిజేయును. ఇటుల ప్రేమతో భజించునట్టి భక్తునకు తనయొక్క సమగ్రరూపమును, పురుషోత్తమ రూపములో అనాయాసముగ పొందగలుగునట్లుగా – 'దదామి బుద్ధియోగం తం యేన మాం ఉపయాంతితే' అని ప్రవచించినట్లుగా, దివ్యమైన బుద్ధిని భగవంతుడే స్వయముగ ప్రసాదించును.

వేరొక మాట – జ్ఞానము ద్వారా భగవంతుడు నిర్గుణుడు, నిరాకారుడు, నిరంజనుడు, మిక్కిలి అగమ్యుడు. అయితే జ్ఞానయుక్త కర్మతో భగవంతుడు సర్వైశ్వర్య సంపన్నుడు, సర్వగుణాధారుడు, సర్వాశ్రయుడు, సర్వేశ్వరుడు, సృష్టికర్త, పాలనకర్త, సంహారకర్త, నియంత్రణ కర్త, ప్రభువు అగును. కాని, భక్తి ద్వారా భగవంతుడు ఇవన్నియగుతూ కూడా భక్తునకు నిజ(స్వ)జనుడైపోవును. సర్వగుణ సంపన్నుడగు పరమాత్ముని అవతరింపజేసి, తద్వారా ఆతనిని దిగువకు దించి –

నికటవర్తిగా జేసి అత్యంతమగు ఆత్మీయతా పూర్వకమైన మధురాతి మధురమగు బంధనములో భక్తునితో పాటుగా బంధించివేయును. భక్తి సాధకుడు - ప్రేమీ భక్తుడు, భగవానుని కేవలము సచ్చిదానంద ఘన పరబ్రహ్మ అనియు, సర్వలోక మహేశ్వరుడు, ఐశ్వర్యమయుడు, స్వామి అనియేగాక, ఆతనిని తన పూజ్య పితాశ్రీగా, స్నేహమూర్తి యగు మాతృశ్రీగా, ప్రాణసముడగు సుహృత్తుగా, ప్రియమైన సఖునిగా, ప్రాణేశ్వరుడగు పతిగా, ప్రేమ మయురాలగు ప్రాణేశ్వరిగా, జీవనాధారుడగు పుత్రునిగా ఇటులే ప్రాణములకు ప్రాణమైన, జీవమునకు జీవనమైన మిక్కిలి ఆత్మీయతా రూపములో పొందును. భగవంతుని దివ్యమైన స్నేహము, అలౌకికమైన ప్రేమ, అనుపమేయమగు అనుగ్రహము, మిక్కిలి సౌహార్ద్రము, దివ్యమైన నిత్య సౌందర్యము, నిత్యనూతన మగు మాధుర్యము, భక్తి ద్వారా మాత్రమే సాక్షాత్కారింపజేయుటకు, ఉపభోగమునకు సాధ్యపడుతుంది. శుష్కమైన జ్ఞాన, కర్మల ద్వారా కాదు. భక్తి హీనులగు వారి వద్ద మనకు భగవంతుడు తండ్రి, తల్లి, పుత్రుడు, మిత్రుడుగా కాగలడని ఊహామాత్రముగ నైనా ప్రస్తావింపరాదు. ఇట్టి ప్రేమ రూపియగు భక్తి ప్రభావం వలననే భగవంతుని దివ్య అవతారములు సంభవించును. దీని ప్రతాపం వల్లనే భక్తుడు తన భగవంతుని దివ్యలీలా రసాస్వాదనము చేయును. ఈ కారణంగానే భగవంతుడు జగత్తు ముందు తన గొప్పతనమును దాచుకొని, మిక్కిలి గోపనీయ భావముతో భక్తుని ముందు తన పరమతత్త్వమును స్వయముగా తన ముఖము ద్వారా ప్రకటింపవలసి వచ్చును. తర్కశీలురగు భక్తులు కాని వారలకు ఈ తత్త్వము పూర్తిగా గుప్తముగనే ఉండిపోవును.

తన ప్రేమభక్తుల తోడ భగవంతుడు యోగమాయ ఆవరణమును త్రోసిరాజని - పూర్తి బాహాటముగానే లీలా వ్యవహారములను చేయును. వారి ముందు సకల తత్త్వములు ప్రకాశించును. నిర్గుణ, సగుణ, సాకారము, నిర్గుణ, నిరాకారములను ద్వివిధరూపముల మిక్కిలి రహస్యమును భగవానుడు బహిర్గత మొనర్చును. అందువలననే భక్తిని గూర్చి భగవంతుడే మీదు మిక్కిలిగా కొనియాడినాడు. కనుకనే మిక్కిలి చతురులైన ఋషి, మునీశ్వరులందరూ భక్తి కొరకై తహ తహలాడు చుండెదరు.

సీ. భక్తితో నొసగిన పత్రమైనను గొని
తినలేదె? ద్రుపదుని తనయ కొరకు,
ఆర్తితో కుసుమమ్ము నర్పించి మొరలిడ
రాలేదె? వే కరిరాజు కొరకు,
పండుదినుచు టెంకగాదు పైపొట్టు సైతము
మింగలేదే? విదురాంగనకయి,
నోరూర బుడిశెడు నీరమున్ గైకొని
త్రావలేదే? రంతిదేవు కొరకు,

గీ. ఏమిగని యారగించితో శ్యామలాంగ!
అట్టి ప్రేమను భిక్షగా బెట్టుమయ్య
జోలెసాచితి నీ ముందు జాలితోడ
పరమ కరుణాంతరంగ! శ్రీ పాండురంగ॥

(శ్రీ పాండురంగ శతకము–45)

ఇంతియేగాక, భగవంతుడు స్వయముగా తన భక్తుని యోగక్షేమములను తానే వహించును. ఇంకనూ ముందుకు వెళ్ళి, అతని చేరువ జేరి ఆటలాడును. ప్రక్కనే కూర్చుని ఆహారమును భుజించును. వారితోడనే నివసించును. ప్రేమాలాపములు వల్లించును. ఒకమారు కొమరుడై ఒడిలో క్రీడించును–

వ్యాపక బ్రహ్మ నిరంజన నిర్గుణ బిగత బినోద।
సో అజ ప్రేమ భగతి బస కౌసల్యా కేం గోద॥

(శ్రీరామచరితమానస్– 1/198)

అనగా – 'సర్వవ్యాపకుడు, నిరంజనుడు, నిర్గుణుడు, వినోదరహితుడు, అజన్ముడునగు పరబ్రహ్మయే, ప్రేమభక్తికి వశుడై కౌసల్యాదేవి యొడిలో క్రీడించెను.'

ఒకచో మాతా పితృలకు వందన మొనర్చును, ఒకచో సేవచేయును–

ప్రాతకాల ఉఠకై రఘునాథా - మాతు పితా గురు నావహిఁ మాథా॥
ఆయసు మాగి కరహిఁ పురకాజా - దేఖి చరిత హరషఇ మన రాజా॥
(శ్రీ రా.చ.మా.1-204-4-)

అనగా- 'శ్రీ రఘురాముడు వేకువనే లేచి తల్లిదండ్రులకు, గురువునకు శిరసు వంచి నమస్కరించును. తదుపరి వారి అనుమతి స్వీకరించి రాచకార్యముల నిర్వహించును. అతని నడవడిని చూచి, చూచి హర్షాతిరేకముతో దశరథ మహారాజు లోలోపలే పులకించిపోయెను.'

ఒకచోట మిత్రులతో కేళి సలుపును. ఒకచోట ప్రియురాలితో ప్రేమాలాపము లాడును. వేరొకచోట భక్తుని గొప్పగా చేయును. వేరొకచోట భక్తుల ద్వారా తన స్తుతి, స్తోత్రములను హాయిగా వినుచుండును. మరొక్కచోట భక్తులకు జ్ఞానోపదేశము చేయుచుండును. వేరొకచోట ఆర్తుని మొరవిని పరుగెత్తును-

సీ. ఏకనాథుని యింట పాకాది కార్యముల్
జేసి కావడి నీళ్ళు మోసి, మోసి,
ప్రేమన్ జనాబాయి పిలిచిన నటకేగి
వేడుకలో పిండి విసిరి విసిరి,
శ్వేతవాహను పైన ప్రీతితో రణమున
లీలగా రథమును తోలితోలి
ఆర్త జిజ్ఞాసువు లర్థార్థులెందరో
మొరలిడ వారికై తిరిగి తిరిగి

గీ. ఎంత శ్రమ నొంది యుంటివో యే మొరమ్ము
దాచు కొందును హృదయాన తాల్మితోడ
విశ్రమింపుము క్షణమైన విమల చరిత
పరమ కరుణాంత రంగ! శ్రీ పాండురంగ॥
(శ్రీ పాండురంగ శతకము-82)

ఇటువంటి అనిర్వచనీయమగు దివ్యానందము భక్తుడు, భగవంతుని బాంధవ్యములోనే సాధ్యమగును. భక్తుడు, భగవంతుని మధ్యలో ఎలాంటి రస ప్రపూరితమగు మాటలు కలుగునో ఏమి తెలియును? ఎటువంటి రహస్యములు

విశ్వాకొనునో ఏమి తెలియును? ఎప్పుడు, ఎక్కడికి, ఏ పరమ దుర్లభమైన దివ్యలోకములకు తన భక్తుని తీసుకొనివెళ్ళి, అచటి అతులనీయ ఆనందమును అనుభవింపజేయునో, అది అంతుపట్టదు. అతనిని తనవానిగా జేసికొనును; కాదు, కాదు తానే అతని వానిగా నైపోవును. అతని హృదయంలో తాను వసించును; అతనిని తన హృదయములో నిలుపుకొనును. సంపూర్ణ తత్త్వజ్ఞానము, పూర్ణ ఆత్మానుభూతి, పరిపూర్ణ ఏకాత్మబోధము సర్వమునూ యిచట దివ్యప్రేమరూపములో పరిణతమై పోవును. అప్పుడిక భక్తుని ముంగిట సేవచేయుటకై ముక్తికాంత యే స్వయముగా అతని వెనకాల తిరుగాడు చుండును. అతని పాదములపై వ్రాలి పోవును–

**యది భవతి ముకుందే భక్తిరానంద సాంద్రా।**
**విలుఠతి చరణాగ్రే మోక్ష సామ్రాజ్య లక్ష్మీః॥** (ప్రపన్న గీత)

'శ్రీ ముకుందుని చరణములందు పరమానందరూపి యగు భక్తి కలిగిన వాని చరణముల చెంత మోక్షసామ్రాజ్య లక్ష్మియే వచ్చి నిలచును.'

ఇట్టి పరమభక్తిని పొంద గలగడమే భగవత్ ప్రాప్తికి ముఖ్యోపాయము. ఈ భక్తి సాధనకు తొమ్మిది మెట్లు గలవు–

1. శ్రవణము, 2. కీర్తనము, 3. స్మరణము, 4. పాదసేవనము, 5. పూజనము, 6. వందనము, 7. దాస్యము, 8. సఖ్యము, 9. ఆత్మనివేదనము.

**శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాద సేవనమ్।**
**అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్॥**

(శ్రీమద్భాగ-7/5/23)

ఈ నవధా భక్తి మూడు విభాగములతో కూడుకొనినది – శ్రవణ, కీర్తన, స్మరణములతో నామసేవ; పాదసేవనం, పూజా, వందనములతో రూపసేవ; దాస్య, సఖ్యమాత్మ నివేదనములతో భావముద్వారా భావసేవ సంపన్నమగుతుంది. వీనిలో – భగవానుని ఏకైక స్వామిగా భావించి, తనను అతని నిత్య సేవకునిగా దలంచి భక్తి చేయుటయే 'దాస్య' భక్తియనబడును. సేవకునిగా భావించినంతనే సరిపోవదు. ప్రతిక్షణము కడు జాగ్రత్తగా, నిత్య

నూతనోత్సాహముతో, తరగని సంతోషముతో, మనోబుద్ధి శరీరముల ద్వారా నిష్కామభావముతో బాహ్యంతర సేవచేయుటయే కర్తవ్య మగుతుంది సేవ పెరిగిన కొలది సంతసము వృద్ధిపొందుటయే దాస్యభక్తి ముఖ్య లక్షణము. నిజమైన భగవత్సేవకుడు సదా సేవాభాగ్యము లభించుట కంటే అన్యమైన ఫలమును ఎప్పుడూ కోరుకొనడు. భగవత్సేవలోనే తల్లీనమైన భాగ్యవంతుల చిత్తమునకు మోక్షము కూడ తుచ్ఛప్రాయమే అగుతుంది.

సేవకు బదులుగా ప్రతిఫలమును కోరువాడు భృత్యుడు కానేరడు, వ్యాపారి కాగలడు. నిష్కామ సేవకునకు ఎలాంటి ఫలాభిసంధి కూడా ఉండదు. తన యజమాని సంకేతంపై నడచుకోవడమే నిష్కామ సేవకుని ధర్మం. ఏది ఎలాంటిదైనా సరే, తుదకు తన మనస్సునకు పూర్తి ప్రతికూలమైన కార్యమైనా సరే, ప్రభువు సంకేతం లభించిన తక్షణమే అతడు దానికి అనుకూలమై పోవును. ఉదాహరణకు ఆదర్శ సేవకుడైన భరతుడు శ్రీరామచంద్రుని సంకేతమునకు అనుగుణ్యముగా వనము నుండి తిరిగి అయోధ్యను చేరెనుకదా! సేవకుడు ఎప్పుడు కూడా మనసును చంపుకొని, వెట్టి చాకిరిగా భావించి సేవ చేయడు. సమధికోత్సాహముతో సేవ చేయుటకై సర్వదా కటిబద్ధుడై యుండును. సేవలో అతనికి అనుక్షణము హర్షము అతిశయించు చుండును. ఎలాంటి ప్రతిఫలము నపేక్షించి సేవ చేయుటకు అతడు సమ్మతింపడు. అందువల్లనే గోపికలు తమను 'నిఃశుల్క సేవిక' లమని తెలియజెప్పగా, ప్రహ్లాదుడు తనను 'నిష్కామదాసుని' గా పేర్కొనెను.

అపూర్వ దాస్యభక్తుడగు హనుమంతుడు ఎప్పుడు, ఏమియు కోరలేదు. అయాచితముగా అతనికి అమూల్యమగు హారమును ఇచ్చినప్పుడు అది రామ రహితమని గ్రహించి, దానిని తునాతునకలు చేసి వేసెను. ఒకవేళ కోరినచో కేవలము సేవను అందించగల చక్కని అవకాశమునే కోరుకొని యిట్లనెను 'ఓ స్వామీ! ఈ భవ బంధమును త్రెంచివేయగల ముక్తిని నాకు ప్రసాదింపవద్దు. తద్వారా నీ యొక్క, స్వామీ - సేవకుల సంబంధము తొలగిపోవును గదా! అందుచేత నేనలాంటి ముక్తిని కోరను, కోరబోను.' ఇట్టి నిష్కామ దాస్య భక్తికి శ్రీ ఆంజనేయ స్వామి శ్రేష్ఠమగు ఆదర్శమూర్తి. శ్రీ రామచరిత మానసములో శంకరుడు యిట్లు ఉగ్గడించెను-

**హనుమాన సమ నహిఁ బడభాగీ। నహిఁకో ఉ రామచరన అనురాగీ॥**
**గిరిజా జాసు ప్రీతి సేవకా ఈ। బార బార ప్రభు నిజ ముఖ గాఈ॥**

(ఉత్తర–49–4,5)

'ఓ గిరిజా! ఆంజనేయుని వంటి భాగ్యశాలి వేరొకడు లేడు, శ్రీ రామచంద్రుని చరణాబ్జముల ప్రేమికుడూ లేడు. ఆతని ప్రేమను, సేవను గూర్చి స్వయముగా ప్రభువగు శ్రీ రాముడే తన ముఖకమలము ద్వారా మాటి, మాటికి ప్రశంసించెను కదా!'

'అతులిత బలధాముడు, బంగారు పర్వతము – సుమేరు సమానమైన కాంతియుక్త శరీరము గలవాడు. దైత్య రూపి వనమును ధ్వంసమొనర్చుటకు అగ్ని వంటివాడు, జ్ఞానులలో అగ్రగణ్యుడు, సంపూర్ణ గుణములకు నిధానము, వానరులకు స్వామి, శ్రీ రఘునాథునకు ప్రియమైన భక్తుడు, వాయునందనుడు అగు శ్రీ అంజనేయ స్వామికి నేను నమస్కరించెదను–'

**అతులిత బలధామం హేమశైలాభ దేహం,**
**దనుజ వన కృశానుం జ్ఞానినా మగ్రగణ్యమ్,**
**సకల గుణ నిధానం వానరాణా మధీశం,**
**రఘుపతి ప్రియభక్తం వాతజాతం నమామి.**

(శ్రీరా.చ.మా.సుందర–3)

భక్తునకు, భగవానునకు జయమగుగాక!

★ ★ ★

# భగవంతుని ఆత్మీయత

మానవుడు తనకు అనుకూలమైన సాంసారిక - ప్రాపంచిక భోగ పదార్థములు లభించినప్పుడు మాత్రమే, అది భగవత్కృప వలన ఘటించినదని భావించి మిక్కిలి గొప్పదైన పొరబాటు చేయును. భగవంతుని కృప నిరంతరము ఉండనే ఉన్నది. అది అందరిపైన, అన్ని దశలలోనూ ఉన్నది. కాని ఈ అనుకూల భోగ పదార్థములు, వాని యందు అనుకూల బుద్ధి యుండుట, ఇవన్నియునూ మనుష్యుని మాయా మోహబంధనములో బంధించునవై యుండును. మాయా మోహములో బంధించి భగవంతుని నుండి వేరుపరుచునట్టి వస్తుప్రాప్తిలో భగవత్కృపను భావించుటయే తప్పు. అయితే మనిషి భగవంతుని భజించు చుండును, భగవన్నామమును జపించును, రామాయణ, భాగవత, గీతాది గ్రంథములను పారాయణ మొనర్చును. ఇట్టి సమయములలో అతనికి ప్రాపంచిక భోగముల ప్రాప్తిలో ఏ కొద్ది మాత్రము సాఫల్యత సిద్ధించినా సరే, అప్పుడతడు నా ఈ కోరిక నెరవేరినది, నాకీ లాభము లభించినది, అని తరచుగా అంగీకరించు చుండును. విశ్వసించుచుండును. సామాన్యంగా లోకములో ఈ విధముగా జరుగుతూ ఉంటుంది. ఈ రకమైన ఉత్తరములు నా వద్దకు విరివిగా వస్తుంటాయి. నేను వారిని ప్రోత్సహిస్తూ ఉంటాను. కాని ఈ పద్ధతి సరియైనది కాదు.

అనుకూలమైన భోగములందు భగవత్కృపను భావించిన వ్యక్తి ప్రతికూలత ఏర్పడిన మీదట అతడే తద్విపరీతంగా ఆలోచించును. అతడిట్లనును - 'భగవంతుడు గొప్ప నిర్దయుడు. నా మీద అతనికి దయలేదు.' మరింత క్షోభ కలిగినమీదట - 'భగవంతుడు న్యాయం చేకూర్చలేదు' అని చెప్పును. ఇంతకు మిక్కిలి మరింత హెచ్చుగా క్షోభకు అతడు గురియగుచో - భగవంతుడే లేడను నంత వరకు వెళ్ళి యిట్లనును - 'దేవుడు లేనే లేడయ్యా! ఇదంతా వట్టి ఊహ మాత్రమే. భగవంతుడే ఉన్న యెడల ఇంతగా భజన చేసినప్పటికినీ ఇట్లు ఏల జరిగెడిది?' అని యిటుల వ్యాఖ్యానించి అతడు ఈశ్వరుని

అంగీకరించకపోవును. అందుచేత ఫలానా స్థితి లభించుటలో భగవత్కృప గలదని భావించుటయే పొరబాటు కాగలదు.

మొట్టమొదటగా సాఫల్యత లభించినప్పుడు మానవుడు అందులో భగవంతుని కృపనే అంగీకరించును. అయితే అటు పిమ్మట ఆ కృప మరుగున పడుతుంది లేదా అతడు దానిని మరచిపోవునని చెప్పవచ్చును. అప్పుడిక ఆ వ్యక్తి తన కృతికి, తన యొక్క అహంకారమునకే పెద్దపీట వేయడం ప్రారంభించును– 'ఫలానా పనిని నేనే చేశాను, ఫలానా విజయమును నేనే సాధించాను' అని ఈ విధంగా అతడు తన బుద్ధికి, తన బలమునకు, తన చాతుర్యమునకు, కళా–కౌశల్యమునకు, నైగ నిగ్యమునకు తానే గర్వించును, అభిమానించును. భగవానుని మరచిపోయి అతడు తన అహంకారమునే ఆరాధించుచుండును – 'సాఫల్యతను సిద్ధింప చేసుకున్నాను, కనుక లోకంలో నన్నే పూజించవలెను. నేను ధనమును సంపాదించాను, విజయకేతనం ఎగురవేశాను. నేను ఫలానా గొప్ప సేవ చేసాను, దేశమును నిర్మించాను, రాష్ట్రమును, దేశమును, ధర్మమును రక్షించినాడను – అని ఈ విధముగా సర్వత్రా, ప్రతి కర్మలో తన 'అహం' ను జోడించి, అతడు 'అహం' యొక్క పూజారిగా, ప్రచారకునిగా తయారగుతాడు. ఈ 'అహం' యొక్క – 'నేను' యొక్క పూజ జరుగకున్నప్పుడు, అతని యందు ఏ విధమగు కించిత్తైన ఆటంకము ఏర్పడినప్పుడు, అతడు క్రోధోన్మత్తుడై పోవును. ముఠాల నేర్పరచును. తద్వారా పరస్పర ముఠా తగాదాలు ఏర్పడును. ఇట్టి రాగద్వేషములు, శత్రుత్వముల చేత వాయు మండలము ఏర్పడుటయే గాక, వర్ధమానమై వ్యాపించ దొడగును. మానవుడు ఇలాంటి ఏదో ఒక ప్రవాహవేగములో పడికొట్టుకొని పోవుచున్నప్పుడు భగవంతుడు దయతో దానికి 'బ్రేకు' వేయును. పతన దిశగా ప్రవాహవేగంలో పడిపోవు చున్న అతనిని, తిరిగి మళ్ళించుటకై ఈశ్వరుడు కృపా వృష్టిని కురిపించును. శ్రీమద్భాగవతములోని బలిచక్రవర్తి కథను పరికించండి–

దైత్యరాజగు బలి యొక్క శక్తి ఇనుమడించింది. ఆయన విశ్వవిజేతయైనాడు. దేవతల శక్తి క్షీణించింది. వారు భయభీతులై దాగుకొనిరి. బలి చక్రవర్తి యొక్క ప్రతాపభానుడు విశ్వమంతటా వ్యాపించెను. బలి భగవద్భక్తుడు. అతడు భగవత్కృపను అంగీకరించువాడు; అయితే ఆతని అంతరంగంలో తన ఈ

విషయమును గూర్చిన అహంకారం మాత్రం పొటమరించింది. తన్నిమిత్తము ఏదైనప్పటికినీ, భగవంతుడు బలిచక్రవర్తిపై దయను చూపెను. అంతే, అతని రాజ్యమునంతటినీ, సంపూర్ణ ఐశ్వర్యమును అపహరించి వేశాడు. పై ప్రసంగంలో 'బలి పట్ల భగవంతుడిట్లు ఏల ప్రవర్తించెను? అను ప్రశ్న ఉదయించగలదు. బలిపై దయజూపుట కొరకే భగవంతుడిట్లు చేసెను, అనునదే ఇందులకు స్పష్టమైన సమాధానము. భగవంతుడతని పై ఈ దయను ఎందుకు చూపెను? దయామయుడగు భగవానుడు తన కృపావృష్టి కురిపించుటేల? అనగా - బలిచక్రవర్తికి తన రాజ్యమును గూర్చి, తన విజయమును గూర్చి అహంకారం వంటిది ఏర్పడింది. అది అటులే ప్రవర్ధమానమగుచో, భగవంతుని విస్మరించి అతడు ఇంకేమి చేసి కూర్చుండునో తెలియదు; అందుకే భగవంతుడు అతనిపై కృపావృష్టిని వర్షించాడు. బలి చక్రవర్తి మరింకేమీ చేయకుండా ఉండాలని, అతనిలో విజయైశ్వర్యముల మదము ఉండరాదని, అతడు భగవదున్ముఖుడు కావాలని, భగవంతుడు అతనిపై కరుణ కురిపించాడు. అంతియేగాదు, ఆతని ఇంటి ముంగిట స్వయంగా రక్షకుడై నిలిచాడు. బలి చక్రవర్తి స్వయంగా దీనిని స్వీకరించాడు. అయితే రాజ్యమును అపహరించి, బలిని సర్వనాశనం చేశాడుకదా! ఇందులో భగవంతుడు చూపిన కృప ఏమిటి? అను సంగతి అవగాహన కావటము చాలా కష్టమైనది; కాని అతనిపై భగవంతుడు అవ్యాజమైన మహత్కృపను చూపినాడనునది మాత్రం సత్యం; సత్యం; పరమసత్యం.'

బలిచక్రవర్తి పితామహుడగు భక్తరాజు ప్రహ్లాదుడు ఈ సంధర్భంగా భగవానునిట్లు స్తుతించెను - 'ప్రభో! బలికి ఐశ్వర్యపూర్ణమగు ఇంద్ర పదవిని నీవే ప్రసాదించితివి. ఈ రోజు నీవే దానిని తిరిగి తీసికొని, ఇతని యందు గొప్పకృపను చూపితివి. నీ కృప వలన నేడు ఇతడు ఆత్మను మోహింపజేయునట్టి రాజ్యలక్ష్మినుండి విముక్తుడయ్యాడు. లక్ష్మీ మోహంతో గొప్ప గొప్ప విద్వాంసులు సైతము మోహితులగు చుండెదరు. ఇటువంటి లక్ష్మిని అపహరించి మహోపకారము చేయు వాడవు, సమస్తలోకములకు మహేశ్వరుడవు, సర్వాంతర్యామివి, సర్వసాక్షిభూతుడవు, అయిన శ్రీ నారాయణ దేవుడవగు నీకు నమస్కరించెదను.' [శ్రీమద్భాగవతం - 8/22/16-17]

ఎవరిపైన అయినా సరే భగవంతుడు ఈ విధమైన కృపజూపి నప్పుడు అతని

ఐశ్వర్యమును నష్టమొనర్చును. ఒక్కొక్కమారు అతడు దుఃఖితుడైపోవును. ఇదే విధముగ ఎవరికైనా గౌరవ, మర్యాదలు పెరిగిపోయినచో, భగవంతుడే అతనిని అవమానము జేయించును. అంతియేగాక, గౌరవ మర్యాదల మాయ నుండి అతడు పూర్తిగా దూరమైపోయి, వెంటనే ఈశ్వరుని వైపు వెళ్ళ గలుగునట్లుగా అపనిందముద్ర పడవేయును. ఈ ప్రాపంచిక నదీ ప్రవాహంలో మునిగి తేలెడువాడు, భగవంతుడిని ఎందుకు అంగీకరించును? జగత్తులో సాఫల్యత లభించు చున్నంతవరకు మనుష్యుడు బుద్ధిని అభిమానించుచునే యుండును. అందువలన అతని నుండి దైవము, ధర్మము - ఈ రెండును దూరమైపోవును. అతడు మోహవశుడై తనకు అసంభవమైనది లేనేలేదని, అకర్తవ్యమంటూ ఏదీ లేదని భావించును - 'నేను కావాలనుకున్న దానిని చేయగలను, నా ముందు నిలిచి ఎవరు మాటలాడగలరు? నా ఔన్నత్యమును అడ్డుకొనగల శక్తి ఈ జగత్తు నందు ఎవరికున్నది?' అని ఇటుల అతడు వదరుచుండును, ప్రేలు చుండును; అయితే భగవత్కృపతో అతని సాఫల్యతనంతటినీ, విజయశక్తిని తుడిచివేయ గలిగెడు పరిస్థితి ఉత్పన్నమగుతుంది. అప్పుడతడు తిరిగి భగవంతుని వైపు దృష్టి సారించును. మానవునకు ప్రాపంచిక ఆశ్రయము లభించుచున్నంత వరకు అతడు భగవంతునివైపు కనీసము కన్నెత్తి కూడా చూడకుండును. అతడిని ప్రశంసించెడు వారలు, అతనికి ఆశ్రయమిచ్చెడు వారలు, హీనావస్థలో కూడా అతని వెంటగల కొందరు మిత్రులు, బంధువులు, ఉన్నంతవరకు, అతడు వారివైపే చూపు నిలుపును. ద్రౌపదీ వస్త్రాపహరణ ప్రసంగము చూడండి. ఈ నిండు కొలువులో 'నన్నెవరేని రక్షించకుందురా!' అని ద్రౌపదికి ఆశ ఉన్నంత వరకు ఆమె భగవంతునివైపు చూడలేదు; అతడిని పిలవనూ లేదు. ఆమె ముందుగా పాండవులవైపు చూచినది, తర్వాత ద్రోణునివైపు దృష్టి సారించినది, విదురుని వైపు గాంచినది, భీష్మపితామహుని వైపు జాలిగా జూచినది. వారలు తనను రక్షించగలరని ఆమెకు విశ్వాసముండినది. కాని ఆమెకు అన్ని విధముల నిరాశే ఎదురైనది. ఎటువైపునుండి ఆమెకు కించిత్తు ఆశ్రయము కూడా లభించలేదు. అప్పుడు ఆమె నిరాశ్రయులకు ఆశ్రయుడు; నిస్సహాయులకు సహాయకుడు; నిర్బలులకు బలమైనవాడు; అయిన భగవంతుని స్మరించినది. భగవంతుడు రావడానికి ఎంత సమయం కావాలి? అనన్య

భావముతో కూడిన కరుణా పూరితమగు పిలుపు రావడమే తరువాయి భక్తవత్సలుడగు భగవంతుడు తక్షణమే పరుగెత్తుకొని వచ్చి చేరును.

జగత్సంబంధమైన ఆత్మీయత, బంధుత్వము మొదలగువానిపట్ల మనుజునకు మమకారము వదలిపోకుండునపుడు, స్వయముగా భగవంతుడే దయదలంచి, దేని ద్వారా అతనికి ముక్తి లభించగలదో, అట్టి మమకార బంధనము నుండి విడివడుట కొరకై అతడు వివశుడైపోవునట్లుగా ఏదో ఒక పరిస్థితిని కల్పింపజేయును. తద్వారా అతడు మమత్వము నుండి విడిపోయిన పిదప అతని కళ్ళు తెరచుకొనును. అప్పుడతడు – 'నేను మోసపోయితిని, నన్ను 'మా,మా' అని భావించువారందరునూ పరాయివారే, అన్నివేళల యందు వీరు నన్ను మోసపుచ్చినారు కదా!' అని వాపోవును. లోకములోని వారందరు సహజముగా ఎక్కడ సాఫల్యతగలదో; ఎక్కడ విజయ పరంపర లభించుచున్నదో; అక్కడికే చేరుకొందురు; అయితే విఫలతగానీ, ఓటమిగానీ లభింపగలదని అనుమానం కలిగితే చాలును, యిక అందరి కందరూ అటనుండి మెల్లమెల్లగా జారుకొనెదరు. తిరిగి వారికై ఎంత వెదికినా జాడ తెలియకుండగ పోయెదరు. సౌఖ్యముగా నున్నప్పుడు ప్రదర్శించెడు ప్రగాఢమైత్రిని, ప్రేమను ఇప్పుడు చూపకుండెదరు. అట్టితరి కేవలము భగవంతుడొక్కడే దిక్కగును. 'సోదరా! నిరాశ చెందవలదు; నా దరిచేరుము' అని ఆయన మృదుమధురముగనూ, నిండు ప్రేమతోడను పలుకును. అంతియేగాదు, నిజమునకు మిక్కిలి సుఖప్రదమైన తన అక్కున జేర్చుకొనుటకే ఆయన యిట్లుజేయును. తనవానిగా జేసుకొనుట కొరకే అతనిని జగత్తు నుండి నిరాశపరచును. అయినప్పటికినీ మనము తప్పులనే చేయుచుందుము. ధనములో, కీర్తిలో, గౌరవములో అనగా – జగత్తులోని ప్రతి సాఫల్యత – విజయము సాధింపబడుటలో భగవత్కృపను అతడు అనుభవించునుగాక! ఇది కూడా మిక్కిలి ఉత్తమమైనదే. కాని దీనత, దుఃఖము, అభావము, అపకీర్తి, అగౌరవము పొందిన స్థితిలో కూడా మనము అతని మధుర మంగళమయమగు కృపనే విశేషముగా అనుభవింపవలయును.

ఉన్నత కుటుంబమునకు చెందిన ఒక విధవా సోదరి ఉన్నది. ఆమె భగవద్భక్తురాలు. నిత్యము భజన చేస్తుంది. ఒకసారి ఆమె యిట్లు తెలిపినది – 'నేను కుటుంబములో ఉండి, నాకు సంతానము గలిగి, అడపడచుల,

తోడికోడళ్ళవలె వస్త్రాభరణములు ధరించి, సంసారములో మునిగిపోయినచో, భజన చేయుటకు తగిన మనస్సు, సౌకర్యము నేడు ఉన్నట్లుగా, అప్పుడు ఉండెడిదికాదు. భగవంతుని కృప నాపైన ఉండినది. కావుననే నన్ను అతడు ప్రాపంచిక ప్రలోభములకు; సకల విషయములకు ఎర చేయకుండా, వాటన్నింటి నుండి దూరముగా నుంచినాడు. అంతియేగాక, తనవైపు వెళ్ళ గలిగెడు చక్కని అవసరమును కల్పించినాడు.' వాస్తవమునకు ఉన్న విషయమిదియే. నిజమైనదిదియే. భగవంతుడు ప్రసాదించిన ఈ విపత్తు మనకు మిక్కిలి మంగళకరమైనది. అదియే మనలను భగవంతుని యందు నిలిపి ఉంచునది. మానవుడు నానా విధములగు వస్త్రములను ధరించాలని, ఫలానా రకమగు గృహములో నివసించాలని, ఫలానా ఆహారమును భుజించాలని, ఇతరులు నాతో ఫలానా విధముగా మాటలాడాలని, ఈ రకమైన వానిని, ఇంకనూ అన్యాన్యమగు సాంసారిక సౌఖ్యములనే సుఖమని భావించుచున్నాడు. కాని వస్తుతః అవి సౌఖ్యములు కావు. ఒకరు నిన్ను ఆదరముతో పలకరించారు; వేరొకరు దూషించినారు - ఈ రెండునూ మాటలే. ఈ మాటలతో ఏ మాత్రము కూడా అగునది, చెడునది ఏమీలేదు. ఒకడు నిన్ను గూర్చి మర్యాదపూర్వకముగా ఐదు మాటలు చెప్పినాడు, అటులే వేరొకడు ఐదు దూషణ వాక్యములన్నాడు అనుకోండి! అయితే దూషించినవాడు తప్పక బాధ కలిగించినప్పటికినీ, ఒకవేళ మీ మనస్సులో మానావమానముల భావన లేక యుండినచో, మీకు ఆ మాటల వలన నష్టమగునదేమీ లేదు; కాని మనమందరము ఒక రకమైన కల్పన - ఊహ చేసుకొని యున్నాము - లోకంలో మనకెంతటి అప్రతిష్ఠ కలిగినది, మనమెంతగా దిగజారి పోయితిమి, అను నీ మాటలన్నింటికి నిత్యము మనకు మిక్కిలి గొప్పభయము కలుగుతూ ఉంటుంది. ఎంత కొద్దిగ నిందింపబడినా సరే, మనమందులకు విపరీతంగా భయపడిపోయెదము, గజ గజ వణకి పోయెదము. కాని, అపనింద వల్లనే ఇతని గర్వజ్వరము సర్వమూ దిగిపోగలదని భగవంతుడు ఒకవేళ భావించిన యెడల, ఒక చతుర చికిత్సకుని ద్వారా చేదు మందు నొసగినట్లుగా అతనిని అపఖ్యాతి పాలు చేయించును.

అవమానము, అపనింద, అపకీర్తి, అప్రతిష్ఠ, తిరస్కారము, ద్రోహము ఇత్యాది సందర్భములందు మనము దానిని ఒకవేళ భగవత్కృపగా భావించిన యెడల, మనము తరించిపోయెదము. అది కృపయే అయియున్నది. కాని దాని గూర్చి విచారింప గలిగెడు అవకాశము మనకు లేదుకదా! సాఫల్యత లభించుచున్నంత వరకు మిథ్యాగౌరవము ఉంటుంది. అప్పుడు మనమిట్లు భావించెదము – 'మాకు వీలు ఎక్కడుంది? ఎంత పని ఉన్నది! మాకు కావలసినవారు ఎందరున్నారు? ఎందరు మిత్రులున్నారు? ఒకచోట విందుకలదు, ఒకచోట మీటింగు కలదు. ఒకచోట ఆట, ఇంకొకచోట వేరొకటి? అందరూ మమ్ములను పిలిచెదరు. అంతటికీ మేము వెళ్ళవలసియే యున్నది. ఏమి చేయాలి? తీరికే లేదు మాకు!' అయితే అప్పుడు భగవంతుడు స్వల్పంగా కృపను ప్రసరించును. అంతియే, ఇక లోకుల మనసులో ఇతనిని పిలుచుట వలన అపకీర్తి కలుగుతుందనెడు మాట వచ్చినచో, ఆనాటి నుండే అందరు పిలవడము మానివేసెదరు. నోటితో మాటలాడుటకే సంకోచించెదరు. భగవంతుడు చిన్న ఉపాయం కల్పించాడు అంతే, ఇంకేముంది? కావలసినంత తీరిక – వీలు లభింపగలదు. ప్రక్కన కూర్చుంటేనే నింద పడుతుందని తెలిసిన వెంటనే లోకులు ప్రక్కన కూర్చోవడం కూడా మానివేసెదరు. ఎంతో కొంత లభింపగలదను ఆశ ఎక్కడ ఉంటుందో, లోకము అక్కడే చేరుకుంటుంది, లభింపగల వస్తువు కేవలము పొగడ్తలే అయినా సరే, ఎంత మాత్రము లభించని చోటునకు లోకులు ఎందుకు వెళ్ళెదరు. కావున లోకము దూరమైపోవును.

ఒకానొక గొప్ప ధనవంతుడు, అభిమానవంతుడు ఉన్నాడు. అతని ప్రక్కన కూర్చొనుటకు అవకాశం లభించడమో, లేదా అతడు తన వద్ద కూర్చుండబెట్టుకోవడమో, జరిగినదనుకొనండి. ఎంతటి సంతోషము కలుగుతుంది. ఒకవేళ ఆయనే స్వయముగా మన ఇంటికే వచ్చినచో, మనకీర్తి పెరిగిపోతుంది. అప్పుడు! ఓహో! మేమెంతటి అదృష్టవంతులము. ఇంత గొప్ప మనిషి మా ఇంటికి విచ్చేసినాడు. అని అందరితో చెప్పుచుందుము. ఇది గొప్పదనము లేదా పెద్దరికము సంపాదించెడు ఒక పెద్ద రోగము. గౌరవము పొందుట, పెద్దరికము లభించుట, కీర్తిని పొందుట, ధనము లభించుట, విశ్రాంతి పొందుట – అని ఏ కొంతైనా పొందాలనెడు కోరిక ఉన్నచోటికి, అందరూ

చేరుకొనెదరు. అది పూర్తికాగలిగిన చోటును అందరు కోరుకొనెదరు. కాని పొందాలనెడు కోరిక ఫలించని చోటికి, ఏమైనా చెల్లించ వలసివచ్చు చోటికి, కొంత త్యాగం చేయువలసిన చోటికి, గౌరవమును త్యజింపవలయు చోటికి, అపనింద గలిగెడు చోటికి, ఎవరునూ వెళ్ళరు, సరికదా! అచట గలవారలే ఇక్కడ నాకేమి పని? అని నెమ్మది, నెమ్మదిగా అటునుండి జారుకొనెదరు. పొందాలనెడు ఎలాంటి ఆశలేకుండా పోయినప్పుడు, లోకులందరు దూరమై పోవుదురు. తమ ప్రాణములను సైతము, తమకొరకై యిచ్చివేయునట్టి, తమ ఇంటిలోని ప్రాణప్రియమైన వ్యక్తుల మనస్సులో కూడా, యిట్టి విషయము వచ్చి తీరుతుంది. కొంత సంపాదించెడు తండ్రి ఉన్నాడు. అతని నుండి కొంత లభించుచుండెడిది. చాల బాగుగా నుండెను. అయితే అతని నుండి లభించునదేమీ లేకుండా పోయి, సేవా, శుశ్రూష చేయవలసి వచ్చినప్పుడు, పుత్రుడు కూడా యిట్లు తలపోయును – ఇప్పుడితడు వృద్ధుడయ్యాడు కదా! ఈయనతో యిక కష్టమే! వేరే మాటలలో చెప్పాలంటే – 'ఇతడు మరణించినచో బాగుండును!' అని భావించును. తన కుటుంబము వారిని అలా ఉంచండి. తన శరీరమే మూడు, నాలుగు సంవత్సరాలుగా వ్యాధిగ్రస్తమైనది. ఔషధము సేవించినా బాగు పడలేదు. అప్పుడు నిరాశచెంది, ఈ శరీరము వెళ్ళిపోతే బాగుండును కదా! అని చింతించును. వెంటనుండెడువారలు, మిత్రులు, బంధువులు, అందరు రకరకములైన మాటలు అనుచుండెదరు – 'ఇల్లు నరకమైపోయినది, ఉండడము ఇచ్చోటనే కదా! ఏమి చేయుదుము. చాలా కష్టముగా నున్నది.' వారలు అతనితో ఉండుటకు సుఖమును భావింపరు. ఇష్టపడరు. అప్పుడిక మిత్రత్వము ఉండబోదు. బంధుత్వము నశించిపోతుంది. ప్రేమ, ఆత్మీయత అంతకంతయును గాలిలో కలిసిపోతుంది.

మానవుడు జాగృతి నొందుట కొరకే భగవానుడు ఇటువంటి పరిస్థితిని ప్రసాదించును. భగవంతుడు ఏమి చేయును? సుఖ సామగ్రి యని మనిషి భావించిన దానినంతయు నష్టభ్రష్టము చేసివేయును. సుఖ సామగ్రి నష్టమైన చోట జంజాట మంతయు ముగిసినట్లే కదా! గ్రద్ద ముక్కునందు మాంసపు ముక్క ఉన్నంతవరకు కాకులు, గ్రద్దలు దాని వెంటపడి ఎగురుచుండును. మాంసపు ముక్క జారి క్రింద పడగానే అవి దాని నుండి దూరముగా

వెళ్ళిపోవును. ప్రాపంచిక వస్తువులన్నియు మాంసపు ముక్కవంటివి. ఇక మనుష్యులందరు కాకుల వంటివారలు.

గౌరవం లేకుండా, ధనము లేకుండా, స్వస్థత లేకుండా, కీర్తి లేకుండా, ఇల్లు లేకుండా, నౌకర్లు లేకుండా, కనీసము తిండి కూడా లేకుండినచో, ఇక మన వద్దకు ఎవరు రాగలరు? అని భావించుట సహజము. ఇదే పరిస్థితిని ఒక బుద్ధిమంతుడు – 'భగవంతుడు దయతో నేను పతనమొంద గలిగెడు పరిస్థితులన్నింటిని దూరమొనర్చెనని నిశ్చయ పూర్వకముగా తలంచును.'

శ్రీ మద్భాగవతములో నలకూబర, మణిగ్రీవుల కథ ఉన్నది. వీరిరువురు కుబేరుని పుత్రులు. వారు అలకాపురిలో నుండెడివారు. రాత్రింబవళ్ళు విహరించడమే వీరిపని. వీరిని అడ్డగించువారలు ఎవరునూ లేకుండిరి.

**యౌవనం ధన సంపత్తిః ప్రభుత్వ మవివేకతా,**
**ఏకైక మప్య నర్థాయ కిము యత్ర చతుష్టయమ్.**

(హితోపదేశ ప్రస్తావిక–11)

'యౌవనము, ధన సంపద, అధికారము, అవివేకము – అను నీ నాల్గింటిలో ఏ ఒక్కటి ఉన్నాచాలును, సర్వ అనర్థములకు హేతువగుతుంది. యిక నాలుగును ఒకచోట చేరినచో, చెప్పవలసిన దేమున్నది? కుబేర పుత్రులలో ఈ నాలుగును విద్యమానమై యుండెను. యౌవన మదము, ధన గర్వము, అధికారమదములుండెను. కుబేరుని పుత్రులు స్వేచ్ఛాచారులై, అవివేకులై యుండిరి. ఒకనాటి మాట – నలకూబర, మణిగ్రీవు లిరువురునూ అప్సరాంగనలతో కూడి వస్త్రవిహీనులై స్నాన మాడుచుండిరి – విలాసము ననుభవింపు చుండిరి. అటువైపుగా దేవర్షి నారదుడు రావడము తటస్థించెను. ఇంతలో నారదుని చూచినంతనే అప్సరస స్త్రీలు శీఘ్రముగా బయటకు వచ్చి, వస్త్రములను ధరించిరి. కాని కుబేర తనయులిరువురు ఉద్దండులగుటచే దిగంబరులై అటులే నిలిచియుండురు. అప్పుడు నారదుడిట్లనియెను – 'మీరు యిరువురునూ జడముల వలె నిలిచిపోవుదురుగాక! వెళ్ళి వృక్షములై పొండు.' అని శపించెను.

ఋషులు, మునులు క్షమాశీలురై యుండి, కీడు చేయువారలకు కూడా

మేలొనరించు చుందురుకదా! మరి నారద మహర్షి గారికి క్రోధ మెట్లు కలిగెను? ఆయన నలకూబర, మణిగ్రీవులను ఏల శపించెను? అను సందేహము కలుగక మానదు. ఇదే సందర్భంగా సత్పురుషులను అవమానించుట, అవమానించు వారలకు గొప్ప వినాశకరమైనదని కూడా చెప్పబడినది.

మరొక్కమాట - ధనము నందు, రాజ్యాధికారమునందు, విజయమునందు మనిషి అంధుడై పోయినప్పుడు, అతని వద్ద ఆ వస్తువులున్నంత వరకు, అతని అంధత్వము తొలగిపోవదు. అట్టి వ్యక్తికి ప్రేమ పూర్వకముగా నచ్చచెప్పుటకు ప్రయత్నించినచో, తద్విరుద్ధముగా అతడు క్రుద్ధుడైపోవును. వ్యతిరేకించి నిలచును. అట్టితరి ఆ వస్తువు అతని వద్ద లేకుండా కావడమే అందుకు దివ్యౌషధము. ఎవడు ధన దుర్మదాంధుడగునో, ధన మదము ఎవనిని అంధునిగా చేయునో, తన సాఫల్యతా మత్తులో పూర్తిగా ఎవడు పిచ్చివాడగు చుండెనో, గ్రుడ్డివాడగు చుండెనో, అట్టి దుష్టుని కొరకు దారిద్ర్యమే పరమౌషధము-

'అసతః శ్రీ మదాంధస్య దారిద్ర్యం పరమంజనమ్'

[శ్రీమద్భాగవతం-10/10/13]

అతని వద్ద నుండి అట్టి వస్తువులను తొలగించడమే అతనికి నేత్రదాన మొసగినట్లగును. ఒకవేళ ఎవరికైనా జ్ఞాన మద మేర్పడినచో, భగవంతుడు దానిని కూడా హరించివేయును. భగవానుడు మన మనోవాంఛను నెరవేర్చడు. అందుచేతనే ఆ నిస్సహాయుల రోగము - ధనమదము నష్టమగుట కొరకై నారదమునీంద్రుడు వారిని శపించెను. అంతియేగాక, వారికి నేత్రములు లభించుగాక! వారు భగవంతుని బడయుదురు గాక! అని శపించెను. జడతారూప మగు చేదు మందుతో బాటుగా నారదుడు వారికి మధురతరమైన దుర్లభమగు ఆశీస్సులను కూడా యిట్లని ప్రసాదించెను - 'వృక్షయోని లభించిన మీదట కూడా నా కృపతో వీరికి భగవత్ స్మృతి కలిగియుండును. దేవతా వర్షములగు ఒక వంద సంవత్సరములు గడచిన పిమ్మట శ్రీకృష్ణ భగవానుని సాన్నిధ్యము లభింప గలదు. అప్పుడు వీరికి జడత్వము దూరమై భగవచ్చరణాబ్జముల ప్రేమ ప్రాప్తించును. తద్వారా వారలు కృతార్థులయ్యెదరు.'

ఒక మారు స్వయంగా నారదుడే ఒక రాజకుమార్తెతో తాను వివాహమాడాలని

కోరుకున్నాడు కాని, భగవంతుడు ఆయనకు వానరముఖమును ప్రసాదించెను. ఈ కథ శివపురాణమునందు, శ్రీరామ చరిత మానసమునందు గలదు. నారద మహర్షికి గొప్ప దుఃఖము కలిగినది. అప్పుడాయన భగవానుని గూర్చి చాలా ఎక్కువగానే అన్నాడు – 'భగవంతుడేమో స్వేచ్ఛాచారి. ఆయనకు వేరొకరి సుఖ సౌఖ్యములు గిట్టవు. ఆయన తన మంచినే కోరుకొనును.' కాని భగవంతుడు మాత్రము అతనిపై కృపను వర్షించెను. ఆ తర్వాత నారదునకు పశ్చాత్తాపము కలిగినది. అప్పుడు భగవానుడు – 'మేము మీ మేలుగోరియే ఇట్లు చేసితిమి' అని అతనితో తెలిపెను –

**అవగున మూల సూలప్రద ప్రమదా సబ దుఃఖ ఖాని,**
**తాతే కీన్హ నివారనముని మైఁ యహ జియఁ జాని.**

[శ్రీరామచ.మా.3–44]

అనగా – 'మీ వంటి విరక్తునకు స్త్రీ సకల అవగుణములకు మూలము, శూలప్రదము. సమస్త దుఃఖములకు గని వంటిది. అని ఇదియే మనసులో విచారించి నేను తమ వివాహమును భంగపరచితిని.'

భగవత్కృప యొక్క ఈ విలక్షణ భావమును తిలకించి నారదమునీంద్రుని తనువు పులకరించి పోయినది. అతని కనుగొలకులందు ఆనందప్రేమాశ్రువులు తళుక్కుమని మెరిసినవి –

**'ముని తన పులక నయున భరి ఆఏ'** (శ్రీరా.చ.మా.3/44/1)

ఇయ్యది తెలియదగిన అంశము. ఒకచో మన విషయములు హరింపబడును. మనోవాంఛితమగు వస్తువు లభింపదు. అప్పుడు భగవానుడు మనపై కృప జూపునని నిశ్చయముగా తెలియవలయును. భగవత్కృపకు ఏదోఒక నిర్దిష్టమైన రూపమనునదిలేదు. అది ఎప్పుడు, ఏ రూపములో ప్రకటమగునో తెలియదు; అయితే ప్రాపంచిక అసఫలత కూడా దాని యొక్క ఒకరూపమే. సాంసారిక భోగములు, అనుకూల విషయముల ప్రాప్తి యందు మనము భగవంతుని కృపను అంగీకరింతుము – ఇది భగవత్కృప యొక్క ఏకాంగీదర్శన మగుతుంది. ఒక విధముగ అసత్ దర్శన మగుతుంది. భగవంతుని కృప నిరంతరము ఉంటుంది. అందరిపైన ఉంటుంది. అంతటా ఉంటుంది. అన్ని వేళల

ఉంటుంది. కాని మనకు అనుకూలమైన విషయభోగములను భగవంతుడు అపహరించిన వేళ, నశింపజేసిన వేళ అతని కృప విశేష రూపములో ప్రస్ఫుట మగుతుంది. మానవుడు ఈశ్వరుని మరచియున్న వేళ, ఆయనను అవహేళన చేసినవేళ, అధ్యాత్మమును, పరమార్థమును పూర్తిగా మరచిపోయి లౌకికమైన స్వార్థ సిద్ధియందు మునిగిపోయినవేళ, భగవానుడు కృపను ప్రసరింపజేయును. పాప ప్రవాహములో కొట్టుకొని పోవుచున్న వానిని రక్షించుట కొరకై భగవంతుడు వాని ఐశ్వర్యమును, సాఫల్యతను బలవంతముగ హరించివేయును. అతనికి అభిలషణీయమైన వస్తువును లభింపకుండ జేయును. అటులే అతనికి లభించిన వస్తువు, అతనిని మోహింపజేసి యుంచినచో, దానిని లాగుకొనును. నష్టపరచును–

'యస్యాహ మనుగృహ్ణామి హరిష్యే తద్ధనం శనైః' [శ్రీమద్భాం.10/88/8]

గౌరవభంగపాటు, ఐశ్వర్యనాశము ఇత్యాదులు భగవానుని మహత్కృప వల్లనే జరుగును. ఒకవేళ ఎవరేని ధనవశులై ఉండియున్న యెడల అట్టి వ్యక్తి తనవాడై ఉండిపోవాలని భగవంతుడు కోరుకొనును. అందుకే ఆయన అతని ధనమును, ఐశ్వర్యమును ఇత్యాది సర్వస్వమును తీసివేయును. భగవంతుడేమో తన దగ్గరకు చేర్చుకోవాలని, అతనిని తన ఒడిలోకి తీసికోవాలని కోరుకొనును. కాని మనిషి జగత్తునే సర్వస్వముగా భావించినంత వరకు, ఈ జగత్తంతయును మనదేననెడు మోహములో నుండిపోవును. ఈ లోకమంతా మనలను ప్రేమిస్తుందనెడు భ్రమను కలిగియుండును. అతడు లోకంలో నలువైపుల ఆశను నింపియుండి, అందులోనే ఉబ్బి తబ్బిబ్బు అయి భగవంతుని మరచిపోవును. అప్పుడతనిలో ప్రాపంచిక ప్రేమ, లోకంలోని మమత, జగత్తుతో బంధనము ప్రగాఢమై, విస్తృతమై, వర్ధిల్లుతుంది. కాని అప్పుడిక భగవానుడు – నీతో ప్రేమ కలిగినవాడు, నిన్ను ఆత్మీయునిగ భావించువాడు, నీకు ఆశ్రయము నిచ్చువాడు, నేను గాకుండా, నన్ను మించిన ఏ స్థితిగాని, ఏ అవస్థగాని, ఏ ప్రాణిగాని, మరేతరమైన సంబంధము వేరొకటి లేనేలేదని అతనికి నిరూపణగా చూపింపజేయును. ఇవన్నియును బూటకమైన వస్తువులే, మోస పూరితమైనవేనని అతడు విశ్వసించ గలిగెడు పరిస్థితిని కల్పింపజేయును. మేము మీతో ప్రేమగా వ్యవహరించెదము, మీ కొరకు ప్రాణములను సైతము

ఇచ్చివేయుదుమని మాటలాడెదరు. కాని ఎప్పుడైనను మీ పైన ఏదేని నిందపడడమో, ఏదేని మీ పాపము ప్రకటమగుటయో, మిమ్ముల్ను లోకులు ద్వేషించడమో, మీ ప్రక్కన కూర్చొనుటకే సిగ్గును అనుభవించుటయో, తటస్థించినను మేము మీ ప్రక్కన కూర్చొన లేమని వారే మిక్కిలి సుతిమెత్తని తర్కముతో 'చూడండి! లోలోపల మన ప్రేమ నిలిచి ఉంటుంది, కాని దానిని బాహిరంగా ప్రకటించి అపకీర్తి పాలగుటచే లాభమేమిటి? అని చెప్పివేయుదురు. నిన్నటి వరకు అతని గొప్పతనములో, అతని యశస్సులో, అతని సుఖములో అనుక్షణము పాలుపంచుకొను చుండెడి వారి, ద్వారానే నేడు అతడు ఒక చెడు వ్యక్తిగా భావింపబడుచున్నాడు. అందుచేత వారు అతనిని 'స్వ' గా – తమ వానిగా స్వీకరింపరు. ఇక వారిలో గల ప్రేమ, మమత్వము, ఆత్మీయత ఏమైనట్లు? మనిషి పాపమును చేయును. అయితే తనను తానే ద్వేషింపగలడా? శ్రీ నారద మహర్షి గారు ప్రేమ స్వరూపమును యిట్లు వ్యాఖ్యానించెను. – **'గుణ రహితం కామనా రహితమ్'** (నారద భక్తి సూత్రములు-54) అనగా ప్రేమ, గుణ రహితమై, కామనా రహితమై ఉంటుంది; ప్రేమ, గుణమును, వస్తువును ఆపేక్షించునదికాదు.

భోగాసక్తులగు సాంసారికులకు, మనతో ప్రేమ లేనేలేదనునది సత్యమైన విషయము. నిజమైన ప్రేమికుడు ప్రభువే! అతడు గుణములను గాంచడు; కామన అతని మనములో ఉండునది కానేకాదు. భగవంతుని ప్రేమయే నిజమైన ప్రేమ. అందువలన భగవానుని త్రోసిరాజని, భోగములందు మనస్సు స్థిరము కావడమనునదే దురదృష్టకరమైనది. లోకములో కొందరి వద్ద కొన్ని ప్రాపంచిక వస్తువులుండుట చేత వారలు తమను తామే 'భాగ్యవంతులు' గా భావించెదరు. పైగా మూర్ఖవశులైన లోకులు కూడా వారిని 'భాగ్యవంతుల'ని ప్రశంసించెదరు; కాని ప్రాపంచిక వస్తువుల అభావముతో ఎలాంటి కోరిక లేకుండా నుండెడు ఒక సాధువు తన స్థితిలో స్వస్థుడై సర్వదా భగవానుని స్మరిస్తూ, సర్వథా నిశ్చింతగా, ఆనందమగ్నుడైయుండు అతనిని లోకము దరిద్రుడని, భాగ్యహీనుడని భావించును. అంతియేగాక, 'ఈ అభాగ్యునకు సుఖ మెక్కడిది? అని కూడ అందురు. కాని మనలను భగవంతుని నుండి దూరమొనర్చునట్టి నరకానలమునందు దగ్ధమొనర్చుటకు, సహాయక మగునట్టి

పదార్థమును, తత్పదార్థజనిత భాగ్యశీలతను గూర్చి ఏమని చెప్పజాలుదుము? శ్రీ శంకరుడు యిలా అనెను-

**సునహు ఉమాతే లోగ అభాగీ।**
**హరి తజి హోహిం విషయ అనురాగీ॥** [శ్రీరా.చ.మా.3/32/2]

అనగా – 'భగవంతుని త్యజించి విషయములను ప్రేమించువాడు భాగ్యహీనుడు, అతని భాగ్యము వక్రించినది. భాగ్యవంతుడెవరు? సర్వమును త్రోసిరాజని భగవత్సేవలో నిమగ్నుడగువాడు.'

భరతుడు, లక్ష్మణుని భాగ్యమును ప్రశంసింపుచు యిట్లు చెప్పియుండెను-

**అహహ ధన్య లఛిమన బడభాగీ।**
**రామ పదారబిందు అనురాగీ॥** (శ్రీరా.చ.మా.7/0/2)

అనగా – 'లక్ష్మణునితో సముడైన గొప్ప భాగ్యవంతుడెవడున్నాడు? అతనికి శ్రీరామచంద్రుని అడుగుకెందామరల యందు అనురాగముండినది కదా!' శ్రీ తులసీదాసు గారు యిట్లు వక్కాణించిరి –

**రమా బిలాసు రామ అనురాగీ।**
**తజత బమన జిమి జన బడభాగీ॥** [శ్రీరా.చ.మా.2/323/4]

అనగా – 'శ్రీరాముని యందు అనురాగియైన ఏ వ్యక్తి లక్ష్మీవైభవమును వమనము వలె త్యజించివేయునో, ఆతడే మహద్భాగ్యవంతుడగును.' భోగ రూపములో మాత్రము లక్ష్మీదేవి అలక్ష్మిరూపముననే – దౌర్భాగ్యరూపముననే యుండును. అట్టి దౌర్భాగ్యరూపమును దూరము జేయుట కొరకు భగవంతుడు కృపను జూపును. అటులే కృపను జూపి మనము సౌభాగ్యమని భావించిన దానినే భగవానుడు హరించివేయును.

తన ప్రేమను హరించివేసెడు వస్తువులన్నింటిని భగవంతుడు హరించివేయును, దూరమొనర్చును. గౌరవము నశించినది; ధనము హరించినది, కీర్తి కరిగిపోయినది. ప్రతిష్ఠ పాడైపోయినది. సర్వస్వమూ మంటగలసినది – ఇంకేమున్నది? మనిషి దుఃఖింప మొదలిడును; తటపటాయించి పోవును; కాని అట్టి సమయమున

దయామయుడగు ప్రభువు మృదు మధురముగా చిరునవ్వు చిందిస్తూ – 'ఈ నా ప్రియమైన బాలకుడు ఆపద నుండి తప్పిపోయెను.' అని నవ్వుకొనును. వాస్తవమునకు మనము దేనిని సంపదగా భావించెదమో, ముమ్మాటికీ అది విపత్తే కాగలదు –

**విపదో నైవ విపదః సంపదో నైవ సంపదః,**
**విపద్వి స్మరణం విష్ణోః సంపన్నారాయణ స్మృతిః.**

అనగా – 'జగత్తులోని విపత్తు, విపత్తి కాబోదు. జగత్తు లోని సంపద, సంపద కాదు. భగవంతుని విస్మృతియే విపత్తు; భగవంతుని స్మరణయే సంపత్తు' అని తాత్పర్యము.

**'సంపద జగమందు సంపదయేకాదు,**
**నిజమైన సంపద నీ స్మరణము,**
**విపదలెట్టివియైన విపదలేకావు**
**నీ విస్మృతియే గొప్ప విపద సుమ్ము'....**

(శ్రీ పాండురంగశతకము)

శ్రీ గోస్వామి తులసీదాసు గారి మాటలలో–

**కహ హనుమంత విపతి ప్రభు సోఈ। జబ తవ సుమిరన భజన నహోఈ॥**

[శ్రీ రా.చ.మా.5/31/2]

అనగా – 'ఓ ప్రభూ! నీ భజన, స్మరణ లేకపోవుటయే గొప్ప విపత్తి యనుబడునని హనుమంతుడు నుడివెను.'

భగవానుని గూర్చిన సాధన, భజన, మధురమైన నామస్మరణ జరుగనట్టి కాలము – 'ఆహాఁ! ఈ కాలమెంతటి అమిత భాగ్యవంతమైనది' అని సమ్మతింపబడినా సరే! అట్టితరి నలుదెసల నుండి యశము, కీర్తి, గౌరవము, పూజాదులు వచ్చిపడినా సరే! ఎన్నో విధములగు భోగములు ఎదురుగా వచ్చి నిలచినా సరే! సమస్త సౌఖ్యములు లభించినా సరే! కాని, అక్కాలము భగవంతుని మరువబడి నందున, అతనివైపు ఉదాసీనమైనందున అది దుష్కాలమే యగును, ఆపదలో నున్నట్టిదే – నిజమైన విపత్తు ఇదియే. అయితే తన స్మరణ

సంపదను ప్రసాదించి భగవానుడే ఈ విపత్తును తొలగజేయును. ఇక్కడ కూడా భగవానుని కృప, ఆత్మీయత ప్రతిఫలించును.

ధనప్రాప్తి, సంతాన ప్రాప్తి, వ్యాపారవృద్ధి, సంపాదన, ప్రశంసా, విశ్రాంతి, చక్కని గృహము, కీర్తి, అధికారము మొదలగునవి లభించునప్పుడు మనము దానిని భగవత్కృపగా అంగీకరించి, ఆయనను మిక్కిలి చిన్నదైన పరిధిలోనికి తీసుకొనివచ్చి, పొరబాటుగా భావించెదము. భగవత్కృప ఇక్కడ కూడా ఉన్నది. కాని, ఈ సకల సామాగ్రి భగవంతుని పూజోపకరణములుగా సిద్ధ పరుపబడియున్నవి. కాని, భోగ బాహుల్యము మాత్రము భగవానుని అకృపాలక్షణమని అతనికి ఎటుల తెలియ జెప్పెదము.

**జాకే ప్రియ న రామ వైదేహీ।**
**తజియే తా హి కోటి బైరీ సమ, జద్యపి పరమ సనేహీ ॥**
**తజ్యో పితా ప్రహ్లాద, విభీషన బంధు, భరత మహతారీ॥**
**బలి గురు తజ్యో, కంతబ్రజ బనితన్హి భయే ముద మంగలకారీ॥**

(వినయపత్రిక-174/1-2)

అనగా – 'శ్రీ సీతారాములు ప్రియము కాని వారలు, ఎంత గొప్ప మిత్రులైనా సరే, వారలు శత్రు సమానంగా పరిగణించి, త్యజింప దగినవారు. అందుకే ప్రహ్లాదుడు తన తండ్రిని, విభీషణుడు బంధువులను, భరతుడు తన కన్నతల్లిని, బలి చక్రవర్తి గురువును, బృందావన వనితలు తమ భర్తలను సైతము త్యజించి ఆనందప్రద కళ్యాణమును బడసిరి. '

శ్రీ సీతారాములు ప్రియము కాని వారలు, ఎంతటి గొప్ప ప్రియమైన వారైనా సరే, మిక్కిలి స్నేహితులైనా కూడా త్యజింపదగినవారే. ఒకవేళ మనము ఒక తండ్రియో, తల్లియో, అన్ననో, గురువో, యజమానులమో అయినచో, మనము వారిని భగవంతుని వైపు నిమగ్నపరుచుటకు కృషి సల్పుటయే మన కర్తవ్యము కాని, వారలను నరకమునందు ప్రవేశపెట్టుటకు తగు ఏర్పాటు చేయకూడదు. భగవంతుని వైపు నుండి విముఖులను చేసి, మనలను భోగములందు ప్రవేశపెట్టెడు తండ్రి, తండ్రికాదు; తల్లి, తల్లికాదు; గురువు, గురువు కాదు; దేవత, దేవత కాదు.

తులసీ సో సబ భాంతి పరమ హిత పూజ్య ప్రాన తేం ప్యారో।
జాసోం హోయ సనేహ రామపద, ఏతో మతో హమారో॥

(వినయపత్రిక-174/4)

అనగా - 'శ్రీరామచంద్రుని పాద పద్మములందు మిక్కిలి ప్రేమ వృద్ధి పొందుటకు కారణమైన వాడే పరమహితైషి, పరమ పూజ్యుడు, ప్రాణ ప్రియమైనవాడు. ఇదియే నా (తులసీదాసుగారి) నిశ్చితమైన అభిప్రాయము.' కావున మనస్సు భగవంతుని యందు నిలవాలి, భోగముల నుండి తొలగాలి.

వాస్తవమునకు భోగముల పట్ల ప్రోత్సాహించుట వలన మనుష్యుని భ్రష్టపరచుటయే; చెడుత్రోవ పట్టించుటయే యగుతుంది. తద్వారా అతని పట్ల శత్రుత్వము వహించుటయే కాగలదు. భగవానుని విస్మరించి జేయగల ఏదేని వస్తువును ఎవరికైనా యిచ్చివేయుట, అమృతమును మరిచి విషపానము చేయించినట్లగును గాన, అతడు మిత్రుడు కానేరడు. తేనె బూసిన కత్తివలె అతని ముఖము పైకి తీయగా నుండి లోపల హాలాహలము నిండి ఉంటుంది. ఆంతర్యము నుండి మిత్రత్వభావము కలిగినవాడు, అవసరమగుచో మనలను సంస్కరించినవాడు నిజమైన మిత్రుడు. విషయభోగములందు ప్రేరేపించి, వానియందు నిలుపునట్టి మిత్రుడు ఎన్నటికినీ మిత్రుడు కాబోడు. **'విషకుంభం పయోముఖమ్'** (చాణుక్యనీతి 2/5) అని ఇలాంటి మిత్రుని గూర్చియే చెప్పబడినది. ఇటువంటి పయోముఖ విషకుంభ సదృశముగా పైకి తీయని పలుకులు పలుకుచు, విషయములందు నియోగింపజేయు మిత్రుడిని త్యజించుటలోనే మేలు గలదు. సాంసారిక విషయ భోగములు సరిగ్గా ఇటువంటివే. అవి చూచుటకు అమృతమువలె గోచరించును కాని పరిణామమునందు విషమే బుజువగును. **'పరిణామే విషమివ'** (గీత 18-38) తల్లి, తండ్రి, గురువు, సోదరుడు, మిత్రుడు - ఎవరికైనా సరే, పాలను చూపించి విషమును చేతికి అందించుట వలన అపకారమే అగుతుంది. కాని ఉపకారము ఎట్లగును? కావున ఇట్టి విషము బారి నుండి రక్షించుకొనుము లేనిచో అది చంపివేయును, నరకములో పడత్రోయును, అని అందరికి సుస్పష్టముగా బోధింపవలయును. అయితే మనము స్వయముగా వీని బారి నుండి రక్షించుకొని జాగ్రత్తగా నున్నప్పుడు మాత్రమే ఇతరులకు ఈ విధముగ బోధించుటకు సమంజసముగా

నుండును. భోగముల ప్రాప్తి, వానియందు స్పృహా, వానిని పొందవలెననెడు కామన (కోరిక), గృహము, వాహనము, అధికారము, పదవి, దర్పము, ఠీవి, ఇవన్నింటిని గాంచి మనస్సు ఆశపడుట మొదలగునవి నరకరూపములగు అసలు - సిసలైన వస్తువులని వక్కాణింపబడినవి-

**తే నర నరకరూప జీవత జగ భవ - భంజన - పద విముఖ అభాగీ॥**

(వినయపత్రిక-140/1)

సాంసారిక ప్రలోభనీయములగు వస్తువులను యిచ్చుట, వాని యందు నియోగించుట, వాని పట్ల ఆకర్షణ కలిగింపజేయుట, వాని గొప్పతనమును గూర్చి తెలియజెప్పుట హితకరమైనది కాదు; ఉచితమైనదీ కాదు. ఈ విధముగ చేయబూనడము వారిపట్ల పగసాధించుటయే అగుతుంది. ఇలాంటి సామాగ్రి కలిగియున్న, వారికి కూడా వీని చెడులను గూర్చి విదితమొనర్పవలయును.

భగవత్కృపను ఆశ్రయించి, భగవంతుడు ఎప్పుడు, ఏ రూపమున ఏ తెంచిననూ, అతనిని స్వాగతింప వలయును. అట్టి కృపా విశేషము ఒకవేళ మన గౌరవమును భంగ మొనర్చునదైనను, పరువు ప్రతిష్ఠలను మంట గలుపునదైనను, జగత్సంబంధమును దూరమొనర్చునదైనను, తద్వారా భగవత్సాన్నిధ్యము అతి శీఘ్రముగా లభింపగలదని స్పష్టముగా తెలియవలయును. తనకు ఎంతో కొంత లభించుచుండు నంతవరకే, ఈ జగత్తు పట్టుకొంటుంది. వృద్ధులైన తల్లి దండ్రులను ఉద్దేశించి - 'భగవాన్! వీరలు యిక నీ పిలుపు వినుటయే మంచిది.' అనగా - వీరు పరలోకమునకు అతిథులగుచో మేము సుఖముగా నుండెదము, అని కూడ లోకులు అనెదరు. సాంసారిక భోగము ఎవరిదీ కాదు. ఎవరి ప్రేమయు యథార్థమైనది కాదు. ధనములో, గౌరవములో, కీర్తిలో - ఎక్కడ కూడా రవంత సుఖములేదు. స్వస్వరూపమునందే, సదా మన వెంట ఉండునట్టిది, ఈ శరీరము నశించిపోయిననూ శాశ్వతముగా ఉండునట్టిది, కేవలము ఆత్మ ఒక్కటే. దానియందే సుఖము ఉన్నది. ఈ ధనము, కీర్తి గౌరవముల సౌఖ్యము, ఋణముగా స్వీకరించిన మిథ్యాసుఖము మాత్రమే. మనము దీనినే భ్రమతో నిజమగు సుఖముగా తెలిసికొనుచున్నాము. ఇది గొప్ప పొరబాటు. ఇవి శాశ్వతముగా ఉండునవి కావు, సౌఖ్యప్రదములు అసలే కావు.

సాధకుడు నిరంతరము భోగముల నుండి మనస్సును తొలగ జేయుచుండ వలయును. భోగములు మనకు శత్రువులు - అనెడు భావమును మనసు నందు మాటి మాటికీ మననము చేయుచు, ప్రేమమయుడు, ఆనందమయుడగు భగవంతుని యందు మనస్సును నిలుపుచుండవలెను. భోగములు నష్టమైన యెడల దుఃఖము నొందక, మహద్భాగ్యముగా భావించి, అద్దానియందు సహజ సుహృదుడగు భగవంతుని కృపను అనుభవింపవలయును. భగవంతుడే మన శాశ్వత మిత్రుడు, ఆత్మీయుడు. ఆయనకు ఎప్పుడునూ అకృప - నిర్దయ తెలియనే తెలియదు. మలేరియా జ్వరం వచ్చినప్పుడు డాక్టరు గారు యిచ్చెడు చేదుమందు మన మంచికొరకేనని విశ్వసింతుము. ఇదే విధముగ ఆవశ్యక మగునప్పుడే మనకు భగవంతుడు చేదుమందును ప్రసాదించును. డాక్టరుగారి ద్వారా మన మేలుకొరకు చేయబడు శస్త్రచికిత్స (ఆపరేషన్) వలె అవసరమగుచో ఆయన మన అంగములను కూడా ఛేదించగలడు. కాని అందు మన లాభమే దాగి ఉంటుంది. భయానకము, దుఃఖదాయకము నగు మన రోగదోషములను దూరమొనర్చుటకొరకై భగవంతుడు మన మీద తన కృపావృష్టిని గురుపించునని గ్రహింపవలయును. భగవానుని కృపగా భావించి నిరంతరము ఆతని నామస్మరణ చేయుచు, తన జీవనమును భగవదిచ్ఛకు అనుకూలముగ తీర్చిదిద్దవలెను. అతడే మనకు నిజమైన ఆత్మీయుడు. అందులకే భగవానుడు మన సర్వకార్యములను నిర్వహించును. అయన నిత్యము మన హితమునే అభిలషించు చుండును; హితమును గూర్చుచున్నాడు; ఇకముందు కూడా హితమును గూర్చుచుండగలడు - అను ప్రబలమైన విశ్వాసమును కలిగియున్నచో, నిశ్చయముగా, నిస్సంశయముగా, నిక్కముగా మన మందరము ధన్యులమయ్యెదము.

॥ శుభం భూయాత్ ॥

★ ★ ★

# నిత్య వ్యవహారంలో భగవద్దర్శనము

అంతిమ యవస్థలో శరతల్పగతుడైన భీష్మ పితామహుడు తన చెంతచేరిన వారిని తలగడ కావలయునని కోరెను. అందరు తమకు తోచిన విధముగ నానావిధ సాధనములను పరుగు, పరుగున తెచ్చిరి. కాని ఆయన ఏ ఒక్కదానిని స్వీకరింపలేదు, చివరికి అర్జునుడు పిలువబడినాడు. అతడు వెంటనే మూడు బాణములను నేలపై నాటి తాతగారికి తలగడగా అమర్చెను. అందులకు భీష్మ పితామహుడు మిగుల సంతసించి – 'బిడ్డా! నీకు జయము కలుగుగాక!' అని ఆశీర్వదించెను.

'ఎప్పటికెయ్యది ప్రస్తుత మప్పటికా మాటలాడి' – అన్నట్లు ఎప్పుడు, ఏ విధమగు వేషముండునో, అప్పుడు దానిని అనుసరించియే వ్యవహరించవలసి యుండును. సర్వత్ర మనము భగవానునే గాంచినప్పుడు, అందరినీ భగవంతుని శరీరములనియే భావించినప్పుడు, వారితో మనము వ్యవహరించుటెట్లు? అను ప్రశ్న ఇచట ఉదయించును. అంతట భగవంతుని దర్శించువాడు భగవంతుని పట్ల కటువు మాటలను ఎట్లన గలడు? కోపగించుటెట్లు? అతనితో పోరాడుట యెట్లు? అనుచిత రీతిగా మసలుటెట్లు? క్రోధవశులై ఒకరితో కటువుగా మాటలాడుటగాని, పోట్లాడుటగాని పాపకార్యమే యగును. కనుక అది ఎప్పుడునూ సంభవింపగూడదు, అనునదే ఇందులకు సరియగు సమాధానము. భగవంతుని గుర్తించి, భగవదాజ్ఞగా పాటించి నటునవలె శాస్త్ర సమ్మతముగా ఆచరించుట వేరే సంగతి. ఎచటనైనా అలాంటి తీవ్రమగు ఆచరణ అనివార్యమగుచో, అచట కడుజాగ్రత్తగా నుంటూ భగవదాజ్ఞగా భావించి, భగవత్ప్రీత్యర్థముగానే అటుల వ్యవహరింపవలయును. వేషమే మనకు అది నేర్పుతుంది. ఆ వేషములో వచ్చిన భగవంతుడే అతనిపట్ల ఉచితమైన కర్మనాచరించుమని అతడే మనకు ఆజ్ఞల నిచ్చుచుండును. తండ్రి వేషములో వచ్చిన భగవంతుడు అదే రూపములో తనను సేవింపుమని స్వయముగా అనుజ్ఞనిచ్చినాడు. కావున వీరు భగవత్స్వరూపులనియే భావించి వారిని పూజింపవలెను. అంతియేగాక, పుత్రుని రూపములో గాని, భార్య రూపములో

గాని, వచ్చిన భగవంతుని ప్రేమింపుము. శాస్త్రానుకూలముగా వారి సేవను కూడా స్వీకరింపుము. అచట ప్రేమను, సేవను స్వీకరించుటయే అతని ఉచిత పూజ అగుతుంది. ఒకవేళ మనము ఆ వేషమునకు ప్రతికూలముగా వ్యవహరించినచో, భగవదాజ్ఞను ఉల్లంఘించినటులే కాగలదు. 'స్వకర్మణా తమభ్యర్చ్య' - యొక్క భావార్థమిదియే. ఆయున ఎప్పుడు, ఏ వేషముతో వచ్చునో, మనము ఆ వేషమునకు అనురూపమైన కర్మచేతనే ఆయునను సేవింపవలెను. వేరు, వేరు రూపములలో గల భగవంతుని గుర్తించుటకు ఒక్క క్షణకాలము కూడా పొరపడరాదనుమాట అతి ముఖ్యమైనది. విభిన్నమగు మారువేషములలో వచ్చినట్టి తన ప్రియతముని లోలోన గుర్తించుచునే, ప్రతిసారి తగిన రీతిగా పూజించుచుండవలెను. ఆ పరమ ప్రభువగు పరమాత్మ నుండి సకల సృష్టి యొక్క స్ఫురణ - ఉద్భవము జరిగినదనియే - 'యతఃప్రవృత్తిర్భూతానామ్' యొక్క అభిప్రాయము. అనగా మనము గాంచుచున్నదంతయును, అనుభవింపు చున్నదంతయును, కల్పింప గలిగినదంతయును, భగవంతుని నుండి ఉద్భవించినదే; ఆ భగవంతుడే అన్నింటా, అంతటా వ్యాపించి యున్నాడు. సృష్టి ఆయున నుండి నిసృతమైనదే -కాని, అతడు తనకంటే వేరుగా ఏదియో సృష్టించినాడనుమాట కూడా లేనేలేదు.

సీ. కనెడు వాడవు నీవె కనుపించునది నీవె
కనుట నీవే హరి! కమల నయన!
వినెడువాడవు నీవె వినిపించునది నీవె
వినుట నీవే కృష్ణ! విశ్వవంద్య!
కనరాని వినరాని ఘన సచ్చిదానంద
మయుభూమ మీవె నిర్మాయమూర్తి
నీ నుండి జగములు గానుపించు మరల
నీ యందెలయములౌ నిర్వికార

గీ. నీవు లేకెల రవ్వంత తావు లేదు
నీవె జగములు జగములే నీవు దేవ!
నిన్నె మనసార నమ్మితి కన్నతండ్రి
పరమ కరుణాంతరంగ! శ్రీ పాండురంగ॥ (శ్రీపాండురంగశతకము-59)

కావున తల్లి, తండ్రి, భార్య, పుత్రుడు, మిత్రుడు, బంధువు అందరిలోనూ ఆయన సమాన రూపముతో, అఖండ రూపముతో వ్యాపించి యున్నాడు. ఆయన లేకుండా అతని వెలుపల ఏమీ లేదు. సమస్తమునందు ఆతడే పరిపూర్ణముగ నిండి యున్నాడు. వివిధ రూపములలో అతడే మనముందు నిలచియున్నాడు. సర్వత్రా విడదీయజాలనంతగా ఓతప్రోతమై యున్నాడు. మనలో కూడా అతడే ఉన్నాడు; ఆతడు నాలో, నేను అతనిలో కలిసిమెలిసి ఉన్నాము –

గీ. ఏది మిగులును వేరుగ నాది యనగ
నీవె నేనైన జగమున నిక్కమరయ
సచ్చిదానంద మయ నిత్య సత్యరూప!
పరమ కరుణాంతరంగ! శ్రీ పాండురంగ॥

భగవంతునితో మనలను వేరుగా భావించి, కర్మయందు ప్రవృత్తుల మగుచోటనే పొరబాటు జరుగుచున్నది. అంతియేగాక, కర్మల ద్వారా భగవదర్శన ఎట్లు జరుగుతుందని మరచిపోతున్నాము. 'ఇదంతా వాసుదేవుడే' అనెడు దృఢ నిశ్చయము చెందుతూ, ఈ సృష్టి యంతయునూ వాసుదేవమయమని, నేను అతని సేవకుడనని భక్తుడు స్వీకరించును.

సో అనన్య జాకేం అసి మతి న టరఇ హనుమంత ।
మైఀ సేవక సచరాచర రూపస్వామి భగవంత ॥ (శ్రీ రా.చ.మా.4/3)

'ఓయి హనుమా! ఈ చరాచర జగత్తు నా స్వామియగు భగవంతుని స్వరూపము, నేను సేవకుడను, అనెడు నిశ్చయాత్మకమగు బుద్ధి ఎప్పుడూ చలించకుండా నుండెడువాడే 'అనన్యుడ'ని అనబడును.' అని శ్రీ రఘునాథుడు చెప్పెను.

ఉన్నదంతయూ భగవత్స్వరూపమే అయియున్నది. సకల సృష్టి, సమస్త చరాచరము అంతయు 'సీతారామమయము' నేను అతని దాసుడను. 'దాసోఽహం, దాసోఽహం' అను చింతన ప్రబలమైనప్పుడు 'దా' తొలగిపోయి 'సోఽహం, సోఽహం' యొక్క అనుభూతి కలుగుతుంది. అప్పుడాతడు నారాయణునిలో లయమైపోవును. కాని భక్తుడు ఆ విధముగా కోరుకొనడు. అతడు తన ప్రియతమునితో రసానుభూతి నొందుటకై, లీలానందమును అనుభవించుటకై

ద్వైతమును సహర్షముగా స్వీకరించును. అంతియేగాక, 'నేను సర్వ సృష్టియందు వ్యాపించియున్న ప్రియతమ ప్రభువు యొక్క సేవకుడును' అనునట్టి అభిమానమును అతడు ఒక క్షణకాలము కొరకైననూ త్యజించుటకు సమ్మతింపడు –

అస అభిమాన జాఇ జనిభోరే ।
మైం సేవక రఘుపతి పతి మోరే ॥

గీ. అన్ని వేళల నంతట ననవరతము
భావమందున సకలము నీవయగుచు,
సేవ యొసగుము కృపతోడ చిద్విలాస
పరమ కరుణాంతరంగ! శ్రీ పాండురంగ!॥

(శ్రీపాండురంగ శతకము–5)

సేవకుడు, యజమాని లేని యెడల ఆటలో ఆనందమే ఉండదు. ఏ, ఏ వ్యవహారము జరుగుచున్నను – ఏ, ఏ రూపములో గోచరించినను ఆయనే ఉన్నాడు; కేవలము అతడే. మనము ఎచటికేగినను మందిరమునకే వెళ్ళుచున్నాము. సర్వత్రా మనము పూజార్థులమే. అన్నిచోట్లా అతనినే పూజించుచున్నాము. రాత్రులందు నిద్రించుచు శయ్యపై పరుండి కూడా దైవ మందిరములో నున్నవారమే. ప్రతి స్థితియందు, ప్రతి యవస్థ (దశ) లోను, ప్రతిచోట, ప్రతి వ్యక్తితో వ్యవహరింపుచునే, మనము భగవంతుని ఆరాధింపగలిగెదము; ఎటువంటి వేషమునకు, అటువంటిదే పూజ –

ఆత్మా త్వం గిరిజా మతిః సహచరాః ప్రాణాః శరీరం గృహం
పూజాతే విషయోపభోగరచనా నిద్రా సమాధి స్థితిః,
సంచారః పదయోః ప్రదక్షిణ విధిః స్తోత్రాణి సర్వాగిరో
యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనమ్.

(శ్రీశంకరాచార్యకృత శివమానస పూజ–4)

'ఓ శంభుదేవా! నా ఆత్మయే నీ స్వరూపము. నా బుద్ధియే పార్వతీదేవి. నీ సహచరులు – లీలా పరికరములు నా ప్రాణములు. ఈ దేహమే నీ దేవళము. విషయ భోగముల ననుభవించుటయే నీ పూజ. నా నిద్రయే సమాధిస్థితి – ధ్యాననిష్ఠయగును. నా రెండు చరణములు సంచరించున దంతయు నీ ప్రదక్షిణమే యగును. నా నోటి ద్వారా మాటలాడు,

మాటలన్నియు నీ స్తోత్రములే. ఎక్కువగా నేనేమి చెప్పజాలుదును. ఎల్లప్పుడు నేను ఏమేమి జేసెదనో, అదంతయును నీ ఆరాధనయే కాగలదు.'

'నిత్య వ్యవహారమంతయును కేవలము భగవత్పూజయే యగుగాక!' అని మనకు నిరంతరము ఏమరుపాటు లేకుండా తప్పక జ్ఞప్తి యుండుండవలెను. వర్ణాశ్రమ ధర్మములు భగవంతుని క్రీడలో ఒకానొక సుందరమైన సాధనము. ఎవరికి, ఏ కర్మనియతియో, అట్టి కర్మతోడనే వారు ఈశ్వరుని పూజించవలెను. సర్వకర్మల చేత భగవదారాధనమే కాగలదు. ఇట్టి స్థితిలో ఒక పాకీవాని పని ఎంతటి గొప్పనైనదో, ఒక బ్రాహ్మణుని పని కూడా అంతటిదే. తమ, తమ పనులలో అందరూ గొప్పవారలే. ఆయా చోట్లలో అందరి అవసరము ఉంటుంది. కాబట్టి అందరిదీ గొప్పతనమే కాగలదు. వ్యష్టియందు ఏ సత్యము గలదో, మారువేషమునకు ఎంతటి ప్రాధాన్యత గలదో, ఆ సత్యము, ఆ ప్రాధాన్యత అదే విధముగ సమష్టిలో కూడా గలదు. అందరు, అంతటా తమ, తమ సమస్త కర్మల ద్వారా నిత్యము భగవంతునినే పూజించుచున్నారు. ఒక అపరాధితో మనమొకవేళ కఠినముగ వ్యవహరించినప్పటికినీ, ఆ వ్యవహారములో ఈ రూపముతో నా ప్రియతముడే ఏతెంచినాడు. ఆతని ఆజ్ఞానుసారమే ఈ నాటకములో అతనిని కఠినమైన మాటలను అనుచున్నామను మాటను మరువకయున్న యెడల క్రోధరూపమగు నటన, సాత్త్విక రూపము ధరించి భగవత్ప్రీతిపాత్రమగు సాధనగా మారగలదు. గుర్తించుట యనునదే ముఖ్యమైనది. గుర్తించలేక పోవుటయే సర్వానర్థములకు మూలము. అటుపిమ్మట యిక ఏమీ లేదు. చోరుని రూపముతో విచ్చేసిన పరమాత్మను, చోరత్వము చేయనీయరాదని ఆజ్ఞాపింపబడినది. దోపిడి దారుని వలె వచ్చిన వానిని బలవంతముగనైనా పారద్రోలుమనియే శాసింపబడినది. అటులే ఆతతాయిగా వచ్చిన వానిని శిక్షించుమని చట్టము చేయబడినది.

వచ్చినవాని మారువేషము కనుమరుగై స్వయముగా పరమాత్ముడే సాక్షాత్కరించునంతగా భగవద్భావము ప్రగాఢమైనపుడు, దోషిని దూషించుటకు గాని, అపరాధిని శిక్షించుటకుగాని, దొంగను దొంగిలించకుండా ఆటంకపరచుటకు గాని సమ్మతము లేకుండాపోతుంది. తన ఇంట జొచ్చిన చోరుని శ్రీహరి రూపములో దర్శించిన గదాధరభట్టు, మోయలేని ఆతను మూట బరువును జూచి, ఆతడే స్వయముగ తన చేతులతోనే ఆ మూటను లేవనెత్తి, అతని నెత్తిన పెట్టి

సాదరముగ సాగనంపెను. ఇదియే ప్రగాఢమైన భగవద్భావలక్షణము. శ్రీహరి దక్క వేరేదియూ గోచరించదు. ఈ కారణముననే ఏ విధమైన వ్యవహారము జరుగునో, అది ఆతని మధురమైన ఉపాసనగా రూపుదిద్దుకొనును. అప్పుడు మారువేషమనెడు తెరతొలగిపోయి, నిజరూపమున భగవంతుడే విచ్చేయును.

కనుక భగవంతుని గుర్తించి చేయునట్టి విషయ వ్యవహారములలో కూడా మనము ఒకవేళ జ్ఞానపూర్వకముగ అందరినీ భగవత్స్వరూపులుగా దలించినచో, నిజమునకు మన ద్వారా ఎలాంటి అశుభకార్యము జరుగనే జరుగదు. ఆతని ఆజ్ఞ ఎటుల గలదో, అటులనే ఆచరించెదము. ఆతనికి అంగీకారమైనదే మన ద్వారా జరుగును. అప్పుడు మనము భగవదీయ సత్తా గలిగిన ఒక యంత్రము వలె అయ్యెదము. ఇక భగవానుడే ఆ యంత్రముగానై తన పనిని మన ద్వారా నిర్వహించునని తాత్పర్యము. అందులో మన సంగతి ఎంత మాత్రము నుండదు. ఆతని ఆజ్ఞయే మన కొరకు ప్రేరకశక్తిగా ఏర్పడును. అప్పుడిక పాప పూర్వకమైన, దుష్టపూరితమైన కర్మలను గూర్చిన ప్రేరణగాని, ఆజ్ఞగాని భగవంతునివైపు నుండి సంభవించుటెట్లు? కోరిక, ఆసక్తి, మమకారము, అహంకారము అనునవన్నియునూ భగవదర్పితము చేయబడుట వలన అవి స్వయముగా నశించిపోగలవు. దీనితో వ్యవహారమునందు ఎలాంటి ఆటంకము ఏర్పడబోదు. ఏ రూపముతో ఎవరు వచ్చినను వారికి తగిన సత్కారము సలుపుటయే, ఆ రూపమున ఏ తెంచిన శ్రీహరికి అటువంటి పూజగా మారిపోవును. 'ఎక్కడ, ఎలాంటి (మారు)వేషమో, అక్కడ అలాంటిదే పూజ' అనెడు భావము గలచోట స్వార్థపూరితమగు అత్యాచార, అనాచారముల వంటివి సంభవింపవు. నౌకరు రూపముతో భాగవంతుడే తమ ఇంటిలో నున్నాడు. అతనిని అవమానించరాదు, అసహ్యించుకొనకూడదు. కాని వ్యావహారికముగా, యజమాని పైన కూర్చొనును, నౌకరు క్రింద కూర్చొనును. మనము ఆ నౌకరును పురమాయించి పనులు చేయించుకొనవలెననియే భగవదాజ్ఞ. కాని వానిని ఏ విధముగనూ అవమానించుట తగదు. మనకంటె వానిని నిమ్నముగ భావింపరాదు. అట్లని వానినే భగవంతుడని భావించిన కారణమున వాని ఆజ్ఞ కొరకే వేచి చూడడముగాని, ఆతడు చెప్పినట్లుగా వ్యవహరించడముగాని చేయకూడదు సుమా! అట్లు చేసిన యెడల, వానిని ఒక సోమరిగా, అవిశ్వాసిగా, రోగిగా మార్చుటయే కాగలదు. తద్వారా మన నాటకము చెడిపోవును. ఆంతరంగికముగా ఆతనిని చక్కగా గుర్తింపుచు అట్లు

గుర్తించుటలో ఎంత మాత్రము ఏమరుపాటు లేకుండా ఉండి బాహ్యముగా మారువేషముతో చూచుచు, ప్రేమ పూర్వకముగా వానిని పురమాయింపుచు, వాని ద్వారా యథాయోగ్యమగు పనులను చేయించుకొనవలయునని నౌకరు వేషముతో వచ్చిన భగవంతునిదే ఈ ఆజ్ఞయని విశ్వసించవలెను. ఈ మారువేషమును ఒకవేళ మనము అవహేళన జేసిన యెడల, భగవదాజ్ఞను యథార్థరూపముతో స్వీకరింపని యెడల, ఈ ఆట బెడిసి పోగలదు. భగవంతుని ఇలాంటి అభినయము వాస్తవ రూపముతో నడువజాలదు. అతి చక్కగా అలరిన చోటనే, సాంగోపాంగముగా పూజ సంపూర్తినొందగలదు.

సామాజిక వ్యవస్థను గాని, కౌటుంబిక నియమములనుగాని అవహేళన జేసినచో భగవదాజ్ఞలుప్తమైపోయి, అది భ్రష్టమైపోవును. ఆటను తనదిగా తలచవలదు, అట్లని ఆటను చెడనీయవద్దు. ఆట సరిగా, సజావుగా నడచిన చోటనే భగవదుపాసన జరుగుతుంది. సర్వత్రా భగవద్దర్శనము నొందువాడు, ఏదేని ఇతర వస్తువును ఏల కోరగలడు? ఎవరిపైనను ఎట్లు కోపగించగలడు? ఎవరియందో ఆసక్తుడేల యగును?

ఉమా జే రామ చరన రత బిగత కామ మద క్రోధ,
నిజ ప్రభుమయ దేఖహిం జగత కేహి సన కరహిం బిరోధ.

(శ్రీరా.చ.మా.7–112ఖ)

శ్రీ శంకరుడు యిట్లనియెను – 'ఓ ఉమా! శ్రీ రామచంద్రుని చరణములందు అత్యంత ప్రేమ గలిగి, కామ, క్రోధ, అభిమాన శూన్యుడైనవాడు, ఈ జగత్తు నందంతటా తన ప్రభువునే దర్శించువాడు, ఇక ఎవరితో వైరము వహించును.'

సీ. ఆటాడగా జగన్నాటక రంగాన
నన్ను నీవంపిన నాటి నుండి,
ప్రతి ఘట్టమందు తత్పాత్ర తన్మయతతో
రాగినై పలువిధ రాగగతుల,
అనయము నవరసాలభినయించుచు నదే
నిజమనుకొని యున్న నిజము మరచి,
తరములేగెన్నాకు కరుణించు మికనైన
శరణుబొందితి నయ్య గరుడగమన!

గీ. ఆత్మ సుఖమును వీడి నీ యాట కొరకు
పాత్ర పోషణ జేసితి సూత్రధారి!
విశ్రమించెద నీ పాద మాశ్రయించి
పరమ కరుణాంతరంగ! శ్రీ పాండురంగ ॥

(శ్రీ పాండురంగ శతకము–26)

అందరు పూజకు పాత్రులే! ఎల్లరునూ పూజనీయులే. లక్ష్మీనారాయణులపై బిల్వపత్రము పెట్టబడదు. అటులే శివునిపై తులసీ దళము ఉంచబడదు. ఎలాంటి దేవతకు అలాంటి పూజ జరుగుతుంది. ఉమ్మెత్త, జిల్లేడు పుష్పములు లేకుండా శివపూజ పూర్తి ఎట్లగును? ప్రభువు ఒక్కడే వేరు, వేరు వేషములలో వచ్చియున్నాడు. కావున అతనికి అటువంటిదే అనగా ఆ వేషమునకు అనువైన పూజయే జరుగవలయునని దీని అభిప్రాయము.

కురుక్షేత్రములో భగవానుడు మృత్యురూపములో ప్రత్యక్షమై, అర్జునునితో – 'కాలోఽస్మిలోకక్షయకృత్ ప్రవృద్ధః' 'నేను మృత్యు స్వరూపుడనై అందరిని మింగివేయుటకు గాను ఇచట సాక్షాత్కరించితిని' అని చెప్పెను. అట్టితరి అర్జునుడు రణరంగమున అందరికి వీరగతిని కల్పించుట ద్వారా భగవంతుని పూజ చేయగలిగెను. ఆ సమయమున భగవానుడు అందరిని భక్షించుట కొరకు ప్రత్యక్షమై యిట్లనియెను. 'ఈ సమయములో నా పూజ ఇదియే – నీవు నిమిత్త మాత్రుడవై వీరందరిని నా నోటిలో పడద్రోయుము.' అక్కడ అదియే స్వకర్మ; భగవదారాధన యొక్క ప్రకృష్టమైన, ఉత్కృష్టమైన పద్ధతి అదియే.

మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మ చేతసా,
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగత జ్వరః. (గీత.3–30)

సుఖ దుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ,
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి. (గీత.2–38)

'ఓ అర్జునా! నీవు అంతర్యామి పరమాత్మనగు నాయందు చిత్తమును లగ్నపరచి, సర్వకర్మలను నాకు సమర్పించి, ఆశలేని వాడవై, మమకారము వదలివేసి సంతాప రహితుడవై యుద్ధము చేయుము. (ఒకవేళ నీకు స్వర్గముగాని, రాజ్యముగాని

కావాలనెడు కోరిక లేకపోయిననూ) జయాపజయములను, లాభనష్టములను, సుఖదుఃఖములను సమానముగా గుర్తించి తదనంతరము నీవు యుద్ధమునకై సిద్ధపడుము. ఈ విధముగా యుద్ధము జేసినచో, నీవు పాపమును పొందజాలవు.'

అర్జునుడు, భగవానుని ఇటువంటి సమయోచితమగు పూజనుండే వైదొలగుచుండెను. అతడు కర్తవ్యచ్యుతుడగు చుండెను. అచట రుధిరదానము తోడనే పూజ కావలసి యుండెను. 'ఆసక్తిని వదలిపెట్టి నా కొరకే చక్కగా కర్మ నాచరింపుము' - అని గీతలోని తృతీయాధ్యాయములో భగవంతుడు, అర్జునునకు ఇలాంటి ఆజ్ఞయే యిచ్చెను. నిజమునకు ఇటువంటి కర్మయే యజ్ఞమగును. అందుచేత ప్రతి పరిస్థితిలోనూ, ప్రతి వ్యక్తి కూడా శాస్త్రోక్తమైన ప్రతి కర్మచేత భగవానుని పూజింప గలుగునని తేట తెల్లమగుచున్నది. ఇదియే మహోన్నత సాధనము. ఆఁ! అయితే, సర్వత్ర, సర్వదా, సమస్తమునందు - పశు, పక్షి, వృక్ష, పతంగాదులలో సైతము ఒకే ఒక భగవంతుడు మాత్రమే గలడని మరువవద్దు; మరచిపోరాదు. కనుక ఆయనను నిరంతరము దర్శింపుమనే వానితో నిత్య వ్యవహారము సలుపవలెను.

సీయరామమయ సబజగ జానీ,
కర ఉఁ ప్రనామ జోరి జుగ పానీ.

నీవు వ్యవహరించెడు ప్రతిచోట శ్రీ సీతారాములే ఉన్నారని స్మరించుకొనుము. లోలోపలే వారికి ప్రణమిల్లి, వారిని గుర్తెరింగి, తదాజ్ఞానుసారముగా నీ పనిలో ప్రవృత్తుడవగు చుండుము.

సీ. శ్రీ రాముడవు నీవు సీత రాధాదేవి
భవుడ వీవాదు పపర్ణరాధ,
వైకుంఠపతి వీవు వరలక్ష్మి రాధిక
పరమ పూర్షుడ వీవు ప్రకృతిరాధ,
చతురాననుడవీవు చదువుల సతి రాధ
గగనమీవందలి గాలి రాధ,
పుం వాచకమ్మెల్ల భువనమోహన! నీవు
స్త్రీ వాచకము దయాసింధు రాధ!

గీ. రంగడవు నీవు రుక్మిణీరమణి రాధ!
నీవె రాధవు రాధయే నీవు స్వామి!
నిఖిలమును నీవె శ్రీకృష్ణ! నేను నీవె
పరమ కరుణాంతరంగ! శ్రీ పాండురంగ ॥

(శ్రీ పాండురంగ శతకము–57)

★ బోలో మోరముకుట, వంశీవాలే కీ జై!! ★

★ ★ ★

# దివ్యానుభూతి

'శ్రీ మద్రాజాధిరాజ, అఖిలాండకోటి బ్రహ్మాండ నాయక శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ సీతారామచంద్ర మహారాజు గారికి జయము! జయము!!' 'సాకేత సార్వభౌములకు జయము! జయము!'.... అయోధ్యా నరేశుని రాజసభా భవన ప్రధాన ద్వారం గుండా, ఈ జయ, జయధ్వనులు వినవస్తున్నవి. ఆంజనేయస్వామి ఆశ్చర్యచకితుడై అటు, ఇటు చూచుచున్నాడు. అది పరిచితమైన గొంతుకాదు; అయోధ్యాపుర జనులది అసలేకాదు; ప్రతి నిత్యము ఏతెంచెడు సుర, సిద్ధ, ముని, ఋషులలో ఎవరిదీ కాదు; అయితే మరి ఈ అపరిచిత స్వరమెవ్వరిది కావచ్చునని, నిండు కొలువులోని వారెల్లరు అత్యంత విస్మితులై, అచ్చెరువొంది ఒకరి ముఖాలొకరు చూచుకుంటున్నారు. ఏమి జరుగనున్నదో నని తీవ్ర ఉత్కంఠభరితులై, ఊపిరి బిగబట్టి కూర్చున్నారు. ధ్వని విన్నదే తడవుగా, ఆర్తత్రాణ పరాయణుడు, దీన, దుఃఖ జనశరణ్యుడు, అనాథ నాథుడగు శ్రీ రామచంద్ర ప్రభువు దిగ్గున రత్నసింహాసనము డిగ్గి సరాసరిగా, పరుగు, పరుగున ద్వారం వైపుగా వెడుతున్నాడు.

సాకేతపుర దివ్య సింహాసనము, స్వర్ణరత్న ఖచితమై శత - సహస్ర కిరణ సూర్యప్రభాభాసమానమై జాజ్వల్యమానంగా ప్రకాశించుచున్నది. మిక్కిలి ప్రేమాదరములుట్టి పడుచుండ భగవతి శ్రీ సీతా మహాదేవిని తన వామాంకమున కూర్చుండజేసుకొని జగజ్జేగీయ మానముగా విరాజిల్లుచున్నాడు భువన మోహనమూర్తి, నీలమేఘశ్యామమూర్తి, భక్త హృదయాంతర్వర్తి, శ్రీ సీతారామచంద్రమూర్తి.

పృష్ఠభాగమున భరతుడు ఛత్రరక్షకుడై నిలిచినాడు. ఇరు పార్శ్వముల యందు లక్ష్మణ, శత్రుఘ్నులు వ్యజన, చామరములనుచేత ధరించి వీచుచున్నారు. పాదపద్మముల పీఠ సమీపమున కరబద్ధుడై కూర్చునియున్నాడు దాసుడు పవనకుమారుడు.

విశాలమైన సభాభవనములో, ఒక వంక మహర్షి, సిద్ధ, ముని గణము - మరొక వంక మంత్రి, సామంత సహచర ప్రజాగణము నిర్వైరపోయింది.

అంతా నిశ్శబ్దం. ఎవరిదా గొంతు? వచ్చిన ఆగంతుకుడెవరు? విస్తృత, విశాల సాకేత రాజ సభాభవనములో అంతటా, అందరిలో ఒకే ప్రశ్న పరంపర కాని, సమాధానం శూన్యం.

గొంతు వినిపించిన మరుక్షణమే, దిగ్గున లేచిన ప్రభువు ఆతురతతో పరుగెత్తినట్లుగా ద్వారంవైపు నేరుగా, త్వరగా వెడుతున్నాడు. ధనుస్సు సింహాసనమునకు ఒక ప్రక్కగా వాలింది. చేతిలో గల సాయకము, భుజముపై నుండి జారిపోతున్న ఉత్తరీయముతో సహా క్రిందపడిపోయింది. సింహాసనంపైనే ఉండిపోయింది మహాతల్లి విదేహనందిని. ఆ మహాప్రభువు పరుగు, పరుగున పరుగెత్తికొచ్చాడు.

ఆంజనేయస్వామి వెనకనే ఉండిపోయాడు. ద్వారమును సమీపించాడు ప్రభువు. ఆశ్చర్యం! అమితాశ్చర్యం!! దుర్బలమైన, మలిన వస్త్రములను ధరించిన, కృశకాయుడగు నొక దీనుడు – "ఆహా! అనాథనాథా! ఆర్తత్రాణ పరాయణా! హే దీనబంధూ! కరుణైక సింధూ! పాహిమాం! పాహిమాం! మాంపాహి!!" – అంటూ తన ప్రభువు అడుగుకెందామరల ముందు వంగి ప్రణమిల్లబోయాడు. అంతే, వెంటనే వంగింది సాకేత సామ్రాట్టు కిరీటం. అందుకున్నాయి అలవోకగా ఆజానుబాహువులు. అమాంతంగా ఒదిగి పోయాడు అతడు అమృత శీకరములగు ప్రభువు కరకమలములలో....

ఎవరా వ్యక్తి? ఎందులకా వ్యర్థ ప్రశ్న? దీనజన బాంధవునకు బంధువుల సంఖ్య కొదువనా?

శ్రీ వత్సాంకిత విశాల వక్షభాగమున తన శిరము నుంచి కంఠము అవరుద్ధము కాగా, పసిపాపలా వెక్కి, వెక్కి రోదిస్తూ, నిర్హేతుక, అవ్యాజ కరుణా సింధువగు శ్రీ రామచంద్రుని ఆజానుబాహువుల ఆలింగనంలో అంటుకొని వుండిపోయాడా వ్యక్తి. అరవింద దళాయ తాక్షములు కృపావృష్టిని గురిపించుచు, ఆ మహాభాగ్యశాలి శిరమును ఆర్ద్రపరుస్తున్నాయి......

*ఇంతకు ఎవరా భాగ్యవంతుడు?*

*అయ్యో! ఇంకా తెలియలేదా?*

*'నీవే! నీవే!! నీవే!!!'*

★ ★ ★

॥ ఓం శ్రీ పరమాత్మనే నమః ॥

# సంత్ వాణి

1. ఈశ్వరునిపై విశ్వాసము కలిగియుండుము.
2. ప్రతి శ్వాసను తుది శ్వాసగా భావించుము.
3. దయకు కొట్టురాని సత్యమునే పలుకుము.
4. సంతత భగవన్నామ స్మరణము చేయుము.
5. సదా శ్రీహరి సాన్నిధ్యములో యుండుము.
6. సంసార భారము భగవంతుని వంతు ప్రభు నిష్కామ సేవ మనవంతు.
7. ఆధ్యాత్మికమార్గము ననుసరించుటయే దుఃఖనివృత్తికి తరుణోపాయము.
8. కలియుగమున సులభమైన నామస్మరణకే పరమ పదము లభించును.
9. శరీర నిర్వహణకై ఎవరికి, ఏది, ఎప్పుడు లభించిన సాత్త్వికఆహారమును భగవత్ప్రసాదముగా స్వీకరింపవలెను.
10. హృదయములో గర్వము, అభిమానము, దంభము రాకుండా శోధించుకొనుము.
11. స్వామి కలడు - భయము వలదు.

* * *